శ్రీ ర స్తు.

# శకుంతలాపరిణయము.

కృ ష్ణ క వి ప్ర ణీ త ము.



చె న్న పు రి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్ర క టి త ము.

1927.



శ్రీ ర స్తు.

# శకుంతలాపరిణయము.

## పీఠిక.



శ్రీవత్సాంకలసద్భుజాంతరయుత స్వీయోరుహారాగ్రరే
ఖావిశ్రాంతి నెసంగుతత్కుచతటిన్ గైసేయుఁ గాశ్మీరసం
భావంబుల్ తనమైఁ బొసంగ నలమేల్మంగాభిధానేందిరా
దేవిం గౌఁగిటఁ జేర్చు వేంకటపతిన్ ధీయుక్తిఁ గీర్తించెదన్. 1

ఉ. ధీనిరవద్య హృద్యనిరతిన్ హరితో భరితోత్సవంబులన్
బూను కడానిబొమ్మ కలుముల్ వెలుముల్గలముద్దుగుమ్మ స
న్మానిమనోవిహారిణి రమారమణీమణి భూరిసూరిస
న్మానముఁ గూర్చుఁగాత గరిమన్ నెఱిమంజుల మైనమత్కృతిన్. 2

ఉ. పుంఖితశత్రుకర్ణములు భూరివిరోధిశిరోధులుం జవ
ప్రేంఖదరాతిమస్తములు విద్విడురంబులు నంగదావళీ
రింఖదరిప్రవేష్టములు ప్రేలఁగ లీల నెసంగుదైత్యభి
చ్ఛంఖముఁ జక్రమున్ గదయు శార్ఙ్గము ఖడ్గము మమ్ముఁ బ్రోవుతన్. 3

క. భాసురసూరిగ్రామణి, భూసురముఖపంకరుహనభోమణి వినమ
ద్దాసనిచయచింతామణి, నే సింగరిగురుశిఖామణిం గణుతింతున్. 4

తే. సోము నన్నపఁ దిక్కనసోమయాజి, భీము శ్రీనాథు భాస్కరుఁ బెద్దనార్యుఁ
బోతనామాత్యు మఱియును బొలుపుఁ గాంచు, నాంధ్రకవితానికాంతుల నభినుతింతు.

ఉ. శ్రీరమణీధవార్పితము సేయుఁ గృతిన్ బ్రతికూలవృత్తిమై
క్రూరపచోవికారములఁ గుందగు నెఱ్ఱని చూడ్కిఁ జూచి వే
సారుచు సారె దూఱుచుఁ గుశంకలఁ బోవకుఁ డన్నలార! మీ
నేరుపు లన్యకావ్యసరణిన్ బురణింపఁగఁ జేయుఁ డొప్పుగన్. 6

వ. అని యివ్విధంబున నిష్టదేవతాప్రార్థనంబును గురువందనంబును సుకవిభూషణంబునుం గుకవిదూషణంబునుం గావించి యెద్దియేనియు నొక్క ప్రబంధంబు రచియించి మదిష్టదైవతంబునకు సంకితంబు గావింపం దలంచునవసరంబున. 7

సీ. ఏమహాత్ములపుట్టినిల్లు బ్రహ్మాదులు శిరసావహించి పూజింతు రెలమి
నే దయాహృదయుల సైదోడుజగములఁ ద్రిస్రోతయై పవిత్రీకరించు
నెవ్వారిశుశ్రూష నేకొఱంతయుం లేక వసుధాసుధాశనవ్రతము లెసఁగు
నేమహామహులసంగ్రామసామర్థ్యంబు పార్థివోత్తములకుఁ బట్టుఁ గొమ్మ
తే. వారు దుర్వారగర్వారవముఖరముఖ, శత్రుజత్రుక్షతిక్షరత్క్షతజకృతజ
యార్ద్రచర్చాసమర్చితోగ్రాసిలసన, భాసురభుజోర్థవిభవులు పాదభవులు. 8

ఆ. ఆ పాదభవులలోపల, నాపాదితధైర్యధుర్యు లార్యు లవార్యుల్
ప్రాపితధనకనకాంబర, గోపాయితకవులు పైఁడికులగోత్రభవుల్. 9

క. ఆరసికులలోఁ బెద్దన, గారనఁగా రూఢదీపకళికావిలస
ద్ధోరణి నిద్ధారణిఁ దగు, కారుణికులలోనఁ బరమకారుణికుం డై. 10

క. పెద్దనగారావేలుపుఁ, బెద్ద నగారాతిభాతి భృతవైభవుఁడై
పెద్దనఁగా రాశూరుల, పెద్దనఁగారాచ మెచ్చుబిరుదముఁ దెచ్చెన్. 11

ఉ. సన్నుతకృష్ణరాయనృపసత్తముచిత్తము రాఁ జరించుచున్
మన్నన మీఱి భూరిబహుమానముగా గజరాజరాజిఁ గై
కొన్నఘనుండు పైఁడికులగోత్రపవిత్రచరిత్రుఁ డౌర పె
ద్దన్నసిరుల్ సరుల్ పొగడ నక్కడ నిక్కడ నెక్కుడై తగున్. 12

సీ. మహిమ నేటూరియిమ్మడి తిర్మలకుమార సింగరార్యుల ప్రియశిష్యుఁ డగుచు
నాచార్యపదభక్తి యాశ్రితావనరక్తి గలిగి శౌర్యౌదార్యకలితుఁ డగుచు
రాయలరాజకార్యమునందు నిరతుఁడై ప్రాజ్యసామ్రాజ్యసంభరితుఁ డగుచు
ధనధాన్యకటకమై తనయిల్లు వర్ధిల్ల ధాత్రీసురత్రాణదక్షుఁ డగుచు
తే. నవని ఠవణించె ఠవణిహృద్యానవద్య, పద్యగద్యావళీస్తవ్యభవ్యనవ్య
కావ్యసంభావ్యభీమసంగ్రామవిజయ, బిరుదుఁ డగుచిఱుమామిళ్ల పెద్దశౌరి. 13

ఉ. మానితమూర్తియైన చిఱుమామిళపెద్దనృపాలమౌళికిన్
సూనుఁ డొరుండు గల్గె మధుసూదనపాదసత్క్రియాపరుం
డానతశత్రుజాలుఁడు నయానయనిర్ణయశీలుఁ డుత్తమ
జ్ఞానఘనుండు తిమ్మనృపసత్తముఁ డుత్తముఁ డిమ్మహిన్ రహిన్. 14

పంచచామరము. ధరాధరాధరాహివర్యధైర్యధుర్యవీట్కర
స్ఫురత్తళత్తళత్ప్రభాప్రభూత శాతహేతిచే

విరోధిరాట్చిరోధిరాజి ప్రీలహేలిసల్పునా
స్థిరామరామరాగుఁడైన తిమ్మభూవిభుం డనిన్. 15

తే. తిమ్మనృపతికిఁ బట్టపుదేవివలన, సురుచిరాకారులిరువురు సుతులు గలిగి
రగ్రజుఁడు వేంకటాద్రీంద్రుఁ డవరజుండు, భవ్యగుణశాలి రామభూపాలమౌళి.

సీ. బలరామ రఘురామ పరశురాములతోడ విక్రమంబునమాద్రి వేంకటాద్రి
ద్విజరాజ ఫణిరాజ దిగిభరాజులతోడ విశదకీర్తులమాద్రి వేంకటాద్రి
యినజాత వనజాత ఘనజాతములతోడ వితరణంబున మాద్రి వేంకటాద్రి
భారతీశ సతీశ భార్గవీశులతోడ విన్నాణమున మాద్రి వేంకటాద్రి

తే. ధారుణి భరించి విబుధుల గారవించి, సురుచిరసువర్ణపూర్ణత సొబగుమించి
యగణితోచ్ఛ్రాయమునదివమాక్రమించి, వెలయుహేమాద్రితోమాద్రి వేంకటాద్రి.

సీ. దినదిన దీనాతిథిప్రీణనంబున కన్నపూర్ణాదేవి కన్నపూర్ణ
నిత్యసత్యవ్రతనిష్ఠాగరిష్ఠత కన్నపూర్ణాదేవి కన్న పూర్ణ
సౌశీల్య వాత్సల్య సాకల్యకల్యత కన్నపూర్ణాదేవి కన్న పూర్ణ
సౌందర్యగాంభీర్యచాతుర్యధుర్యత కన్నపూర్ణాదేవి కన్నపూర్ణ

తే. వరకవుల వేలుపులగిడ్డి వాసిరెడ్డి, పద్మనాభునితోఁ బుట్టుపడఁతి యగుట
కన్నపూర్ణమహాదేవి కన్నపూర్ణ, మహితసద్గుణనికురుంబ మాదమాంబ. 18

క. ఆమాదమాంబవలనఁ బ్ర, ధామహితుఁడు వేంకటాద్రితనయుం గనియెన్
సోమదరస్తోమ శర, వ్యోమసరిద్ధామకీర్తి నూర్జితమూర్తిన్. 19

క. వేంకటనాథుం డొసఁగిన, సంకల్పఫలం బటంచు జననీజనకుల్
వేంకటపతినామంబున, నంకితుఁ గావించి రతని నాశ్రితరతునిన్. 20

క. శంకాతంకానంకా, హంకారస్ఫారశౌర్యహార్యత్పుండై
వేంకటపతి ధృతిమారటు, వేంకటపతి యనఁగ జగతి వినుతికి నెక్కెన్. 21

క. ఆవేంకటపతినరపతి, దేవి రహిం బాపమాంబ దినదినమార్యా
దేవిని శ్రీదేవిని వా, గ్దేవినిఁ బూజించు వసుమతిన్ సుమతియనన్. 22

ఉ. నేరుపుమీఱఁ బుట్టినిలు నీరును రాలును గాఁగఁబుట్టిరా
మారునిఁగన్న తల్లియుఁ గుమారునితల్లియు సాటివత్తురే
భూరితరవ్రతాచరణఁ బుట్టినయింటికి భవ్యకీర్తియున్
బౌరుషమున్ దనర్చిధరపై నొఱపైతగు పాపమాంబకున్. 23

చ. పటుగతిఁ బాపమాంబకును బ్రాభవవైభవశాలియైన వేం
కటపతికిన్ దనూభవులు గల్గిరి నల్వురు విక్రమక్రమో
ద్భటరిపుహారి జగ్గనరపాలుఁడు రామధరాపరుండు మా
రట మదనుండు పెద్దశివరామ మహీపతి వేంకటాఖ్యుఁడున్. 24

మహాస్రగ్ధర. పరవైరించప్రపంచావరణమున యశోవ్యాజనైజాంశులొప్పం
జిరుమామిళ్లాన్వవాయాంచితజలనిధికిన్ శీతభానుండు వోలెన్
బరఁగున్ జగ్గక్షమాధీశ్వరుఁడురుతరసంపన్నిధానుండు దానా
పరకానీనుండు బాహాబలచరితజగత్ప్రాణుఁడై రాణమీఱెన్. 25

తే. పావనీసత్సంప్రదాయంబునందు భాగ్య, చిహ్నములతోడ నుదయించి శీలవృత్తి
నియమముల మేటియగుభవానీవధూటి, భార్యగా నేలె జగ్గభూపాలకుండు. 26

మ. నిరతిన్ జగ్గనృపాలమౌళికి భవానీదేవికిం గాంచనాం
బరుసన్నన్ సిరిగన్నయన్న శివరామక్షోణినాథుండు ని
ర్భరఘోరప్రతివీరహాలహలమా పట్టాభిరామప్రభుం
డరుదా వేంకటశౌరినాఁగలిగిరూహన్ మువ్వురాత్మోద్భవుల్. 27

వ. అందు. 28

సీ. తనదానమర్థులొందినఁగాఁకఁ జూడక మిత్రభావంబున మెలఁగునేనిఁ
దనభోగమొరులు మీఱిన వెచ్చనూర్చక తానజిహ్మగలీలఁ దాల్చునేనిఁ
దనవారినొరులు వేఁడిన నైనవీడక ఘనవృత్తి భువనమ్ము మనుచునేనిఁ
దనధర్మమొరులు పూనిన డీలుపడనీక సమదృష్టి మోదమ్ము సలుపునేనిఁ

తే. దేజమునఁ జిత్రభానుండు ధృతి నహీనుఁ, డీవి ఘనమూర్తి గరిమ మహేశ్వరుండు
సాటిరాఁదగునాశ్రితశ్రమపయోధి, తరణి కిచ్చినశివరామధరణిపతికి. 29

క. రమణాంబను లక్ష్మాంబను, గ్రమమునఁ బాణిగ్రహణము గావించి నృపో
త్తముఁ డయ్యిరువురవలనం, గొమరుల నిరువురను గాంచి కూర్మి వహించెన్. 30

వ. అక్కుమారయుగళమ్మునందు. 31

తే. రమణమాంబాత్మజుఁడు బలరామనృపతి, లక్ష్మణాంబాసమేతుఁడై లచ్చి వహించె
నచ్చమాంబాసుతుఁడు పార్వతమ్మతోడఁ, బ్రబలుఁడై యొప్పె వేంకటరామనృపతి.

క. చినశివరామసుధీమణి, యనుజుఁడు పట్టాభిరామయాగ్రణి లక్ష్మాం
బను బెండ్లియాడి క్రమమునఁ, దనయచతుష్కంబుఁ గాంచి ధాత్రి రహించెన్. 33

సీ. రంగమాంబామనోరాజీవమిత్రుఁడై కరమొప్పు రఘునాయకప్రభుండు
వెంకమాంబాగుణాలంకారకలితుఁడై రాణించు వేంకటరామవిభుఁడు
బుచ్చమాంబాపరిస్ఫురితోపభోగుఁడై మహిమంబుఁ గాంచు లక్ష్మణవిభుండు
చినరంగమాంబికాశృంగారవిభవంబుఁ గాంచుకుమారజగ్గక్షితీశుఁ

తే. డబ్జభవునాననముల వియ్యంబుగాంచి, వేదములతోడ నెయ్యమ్ము విస్తరించి
ప్రబలెఁ బట్టాభిరామభూపాలసుతచ,తుష్టయము పేర నబ్ధిచతుష్టయంబు. 34

తే. అవనిఁ బట్టాభిరామన్నఁ యనుఁగుఁదమ్ముఁ, డాశ్రితామరధాత్రీరుహమ్ము శత్రు
కాలకూటము మిత్రసుధాలవాల, మోలిఁ దనరారు వెంకభూపాలకుండు. 35

క. ఆ వెంకక్షితిపతిరహి, గావిలసిలు వెంకమాంబికాసతివలనన్
ధీనిహితునాయఁడమ్మనఁ, గావి శ్రుతిఁగాంచుతనయుఁ గాంచి రహించెన్. 36

తే. పార్వతీనామమున నేత్రపర్వమైన, బాలికామణిఁబెండ్లియై హేలఁదనరె
నాసగోనుసర్వసర్వంసహామరులకు, నవసుధాసారములతిమ్మ నాయఁడమ్మ. 37

వ. ఆకూటస్థు లగునలువురిలో నగ్రజుం డగుజగ్గక్ష్మాపాలకువంశప్రకారంబు వివరింపం
బడియె వెండియు. 38

శా. ఆజగ్గక్షితిపాలుతమ్ముఁ డలరున్ హంవీరవీరాసిధా
రాజీర్యద్రిపురాజి మేళనలలద్రంభాదికాద్యప్సరః
కూజత్కంకణకింకిణీఘణఘణాఘోషాస్ఫురద్వ్యద్ధసీ
మాజాగ్రత్తురగుండు పెద్దశివరామక్షోణిపాలుం డిలన్. 39

కవిరాజవిరాజితము. సదయవిచారుఁడు నారదపారదశారదనీరదహీరదర
స్పదమలకీర్తివిహారుఁడు ధీరుఁ డుదారుఁడు శూరుఁడభీరుఁ డనిన్
బదిలుఁడు శశ్వదనావిలకేవలభావలతావలనాకలనన్
బెదశివరామసుధీమణి యాశలఁ బేశలకౌశలుఁడై చెలఁగున్. 40

తే. సంశ్రితసురద్రువల్లియోషామతల్లి, బంధుజనసింధుసరణి సంపదలధరణిఁ
బరఁగు పెదశివరామభూపాలు దేవి, భూరిసద్గుణనికురంబ బుచ్చమాంబ. 41

ఆ. ఎలమిబుచ్చమాంబవలనఁదనూభవ, పంచకంబుఁబడసెఁబంచశరుని
బాణపంచకంబుభాతి శ్రీపెదశివ, రామవిభుఁడు భాగ్యరాశియనఁగ. 42

చ. రతిపతికన్నమిన్న జయరామవిభుండు ఘనుండు వెంకన
క్షితిపతి సాహితీసలిలసింధుఁడు రామధరాధురంధరుం
డతిధృతిలక్ష్మణప్రభుఁ డుదారయశుం డగుచంద్రమౌళి యు
ప్రతిభవులార పెద్దశివరామతనూభవు లాత్తవైభవుల్. 43

వ. అందు. 44

క. అలజయరామసుధీమణి, వలనొప్పఁగఁ బార్వతమ్మవలనఁ దనయులం
బలియురనిరువురఁ గాంచెన్, సులలితగతి వెంకవిభుని సూరప్రభునిన్. 45

తే. వెంకమాంబాసమేతుఁడై వెంకధరణి, పాలతిలకుండు సిరులచేఁ బరిఢవిల్లె
బుచ్చమాంబాసమేతుఁడై భూరిసౌఖ్య, సంపదలుగాంచె సూరనిలింపవిభుఁడు. 46

మ. జయరామప్రభునూద్భుతమ్ముఁ డురుదోస్సారుండు ధీరుండుని
ర్భయుఁ డుగ్రాహవదోహలుండు విమతప్రాలేయబాలార్కుఁడ
వ్యయనారాయణపాదభక్తినిరతుం డార్యుండు రంగాంబికా
ప్రియుఁ డావెంకనృపాలచంద్రుఁ డిలఁ గప్పెన్ గీర్తియన్వెన్నెలన్. 47

శా. ఆవెంకక్షితిపాలసోదరుఁడు రామాధీశ్వరుం డుల్లస
ల్లావణ్యంబునఁ గావ్యనాటకగుణాలంకారపారీణతా
ప్రావీణ్యంబున వాక్పటుత్వమున సద్భావంబునన్ విక్రమ
శ్రీవైయాత్యమునన్ బ్రసిద్ధిఁ దగుచున్ జెల్వారు నిద్ధారణిన్. 48

సీ. తమ్ములయెడలనెయ్యమ్ముసూపఁడుగాని రాజు కాంతులసాటిరాకయున్నె
యిచ్చుచోఁగొంకి పెల్లగురకుండఁడుగాని రసద మిాగికిసాటిరాకయున్నె
సశరీరుఁడగుచు సాక్షాత్కరింపఁడుగాని రతిరాజు రహిసాటిరాకయున్నె
కువలయామోదంబుఁ గూర్పఁజాలఁడుగాని రవి తేజమునసాటిరాకయున్నె

తే. యీాదరస్మితవదనునకీవదాన్య, మౌళికీరూపశాలికీమానితప్ర
తాపునకునంచుబుధులుచిత్తములనెన్నఁ, బ్రబలుపెదశివరామన్నరామశౌరి. 49

సీ. ప్రథమాంశమునధర్మభంగముంకువగాఁగ, బాణిగ్రహణమైనపలుచఁదనము
రాఁగూడదని పల్కురమణువెంబడినేగి కానలోవిహరించుగడుసుఁదనము
మాయామృగమువెంట మగఁడుపోవఁగ దంట మఱఁదినంపిననాటిమంకుతనము
రావణాసురువీట రహిఁబాసి నానాట చెఱసాలనెలకొన్న చిన్నతనము

తే హావణిఁదీర్పఁగఁగ్రమ్మఱనవతరించి, పైఁడికులగోత్రమిద్ధాత్రిపాత్రముగను
జెలఁగురామక్షమాపాలుఁ జెట్టపట్టె, ధీరధోరణిజానకీదేవిఠీవి. 50

తే. ఠీవిఁదనరారుజానకీదేవివలన, రామభూపాలతిలకుండు ప్రేమమీాఱఁ
బడసెమువ్వురఁ దనయులభరితనయుల, హరిహరాబ్జభవాంశమ్ములందువారి. 51

క. వెంకక్షితిపతియనశౌ, ర్యాంకుఁడులక్ష్మన్నయవనిజాశ్రితకువలై
ణాంకుఁడుసీతప్రభుఁడన, నంకితనామములవిజయమందిరిధరణిన్. 52

చ. సలలితభాగ్యచిహ్నముల సన్నుతికెక్కుడుచిన్నమాంబికా
జలరుహపాణితోడసుఖసంతతిఁగాంచుచుభూరివైభవం
బులఁ దనరారి సూరిజనముల్ జనముఖ్యుఁ డటంచు నెంచఁగా
విలసిలురామభూవరునివెంకనృపాలుఁ డలోలుశీలుఁడై. 53

మ. చిరుమామిళ్లకులాబ్ధిచంద్రుఁడు జయశ్రీసాంద్రుఁడచ్చన్నభూ
వరుఁడున్ వెట్టినునాఁదనర్చుతరుణింబాణిగ్రహంబై శుభ
స్ఫురణన్ సంతతిఁ గాంచి విప్రతతికిన్ భూగోహిరణ్యాదిభా
స్వరదానంబులఁ దృప్తిచేసి తనరెన్ సభ్యుల్ ప్రశంసింపఁగన్. 54

శా. ఆరామప్రభుసీతభూతలవిభుం డశ్రాంతవిశ్రాణన
స్వైరంబైనసురద్రుపంచకము గెల్వం బంచశాఖాహ్వయో
దారంబైనిజహస్తవారిరుహమిద్ధాత్రీసురశ్రేణికిన్.
హేరాళంబుగఁ గోర్కులీనఁదనరున్ హేమాద్రితో మాద్రియై. 55

సీ. కులగోత్రముల కాదికొన్న చిన్నతనంబు విసములో నుదయించుకసరుఁదనము
పుడమి నంతకనామమునఁ జేర్చువైళంబు రేలు వెలారించు జేలతనము
కాఁపురం బప్పులగడపుకోఁచఁదనంబు నిలిచినచోట కాల్నిలనిగోనము
మేనిమచ్చల నిచ్చలూనువిన్నఁదనంబు గళమున గరమూను గడుసుఁదనము
తే. మానదిగ్రాజదాసవశ్యానురూప, రూపగుణగణవిభ్రమారూఢగాఢ
వైభవస్ఫూర్తిమస్ఫూర్తి వసుధఁ బరఁగె, సరసుఁడైన సీతారామధరణివిభుఁడు. 56

క. తీవిన్ వేంకటలక్ష్మీ, దేవీమణివలన సంతతిం గాంచుచు వి
ద్యావైదుష్యంబునను, ద్భావంబున సీతనృపతి ప్రబలున్ ధరణిన్. 57

క. ఆరామప్రభునకుజుం, డైరాజిలులక్ష్మణేంద్రుయశ మిల వెలసెన్
దారాచలతారాధిప, తారాచయతారహారతారాభంబై. 58

క. ఆలక్ష్మీపతి నరపతి, వైలమ్మనజానకమ్మ వలననిరువురం
బాలురఁ గాంచెం బృథ్వీ, పాలురఁగా నాయఁడమ్మ పాపయ్యయనన్. 59

క. ఆనాయఁడమ్మ నెమ్మది, గానెలకొని పాపమాంబికాసహితుండై
నానావిధభోగమ్ముల, నానందమునొంది జగతి నభిసుతిఁ గాంచెన్. 60

క. ఆనలువురు కూటస్థుల, లోనంగడగొట్టు సుజనలోలుఁడు వెంక
క్ష్మానాథుఁడు గోవిందాం, బానురతిం గాంచె సీతయాఖ్యుం దనయున్. 61

క. ఆనలుగురుధీరులఁ దగు, నానలుగురు మీఱువిభ్రమాతిశయమునన్
ధీనిరతిజయమునం జతు, రాననుఁడై రామభూపరాగ్రణి ధరణిన్. 62

పంచచామరము. పన్నగారివాహుఁడూహవన్నిచిన్నపాఁపఁడై
య న్నగారివెంటదంట యై చరించు వైఖరిన్
బన్నగారివాహనాంశభాజి రామభూవిభుం
డన్నగారివెంటదంట యైచరించు వైఖరిన్. 63

మ. అనయంబు న్వినయంబు పండితుల కత్యానందమును గూర్పహే
మనగేంద్రప్రతిమానధైర్యుఁడగు రామక్షోణిపాలుండు తా
ఘనదానంబును క్షాత్రము న్గలసి యేకస్ఫూర్తి మూర్తీభవిం
చినచందంబునఁ దోఁచుఁ జూపఱకు నక్షీణప్రభావోన్నతిన్. 64

తే. శీలగుణవృత్తముల ధాత్రిఁ జెలగువాసి, రెడ్డిపెదపద్మనాభుపుత్రీలలామ
భాగ్యములదీవి రామభూపాలు దేవి, పడఁతులకు మేటి రమణమాంబావధూటి. 65

తే. రమణమాంబికవలన నారామవిభుఁడు, కనియె మువ్వురుతనయులగణితనయుల
ఘనునిఁ గోదండరామునిఁ గవిజనాప్తు, నయుల వేంకటరామన్ననాయఁడముల. 66

వ. అందు. 67

క. కోదండరామజనపతి, వేదండకరప్రకాండదివిలసన్నిజబా

కోదండమున వసుంధరఁ, బూదండరహి న్వహించె బుధులు నుతింపన్. 68

శా. మాన్యుండై తగువాసిరెడ్డి పెదలక్ష్మక్షోణిభృన్మాళికిన్
గన్యారత్నము నాగమాంబ తనకుం గాంతాలలామంబుగాఁ
'గోన్యోమత్సదృగిత్యు' దారభుజుఁడై కోదండరామార్యమూ
ర్ధన్యుండాత్మభవుం జెలన్న యనునుద్యన్మూర్తిఁ గాంచెన్ రహిన్. 69

క. శ్రీపతిభాతిఁ జెలన్నో, ర్వీపతియలబోడెపూడి వేంకటరామ
క్ష్మాపతిగాదిలిపట్టిన్, రూపవతిఁ బకీరమన్ని రూఢి వహించెన్. 70

వ. అమ్మువ్వురిలోనం గోదండరామనృపాలునకుం గడగొట్టుతమ్ముండు. 71

ఉ. దండిగనాయఁడన్ బ్రభుఁడతండసఁదు ఖండనభూమి భూరిదో
ర్మండలమండలాగ్రమరిమండలిపై జళిపింపఁ గాంచి యొం
డొండతిలోత్తమాప్రభృతియోషలు భూషణభూషితాంగులై
చండమరీచిమండలమె సారెకుఁ జూతురు కౌతుకంబునన్. 72

క. శ్రీవాసిరెడ్డినాగ, క్ష్మావరునకుఁ బార్వతమ్మగారికిసుతయై
శివిన్ దగు వెంకాంబను, శ్రీపిలసిలు నాయఁడమ్మ చేకొనితనరెన్. 73

సీ. సత్యభాషల హరిశ్చంద్రుండు శ్రీరామచంద్రుఁ డీనరపాలచంద్రుఁ డొకటి
నవనవోన్నతి రతీనాథుండు నిషధభూనాథుఁ డీధారుణీనాథుఁ డొకటి
కాంతి స్వాహావధూకాంతుండు పద్మినీకాంతుఁ డీమేదినీకాంతుఁ డొకటి
రణరంగమున బలరాముండు జమదగ్ని రాముఁ డీసుగుణాభిరాముఁ డొకటి
తే. యీవి ధనదుండు వనదుండునీతఁ డొకటి, హేల నీశుండుమరుదీశుఁ డీతఁ డొకటి
ప్రబలుఁడనవిశ్రుతివహించె రామధరణి, పాలు వేంకటరామభూపాలమౌళి. 74

సీ. తనరాకకెదురుచూచినచాతకమ్ముల దగఁ దీర్చునవపయోధరముమాడ్కిఁ
దననవాభ్యుదయంబుఁ దగఁగోరుజక్కవ కవల లాలించుభాస్కరునికరణిఁ
దననవాధిగమంబుతటి వేచువిపినసంతతులఁ బ్రోదిగొను వసంతునివిధమునఁ
దనదుసాంగత్యమాత్మఁ దలంచుకుముదిని కామోదమొసఁగు నేణాంకుసరణి
తే. నభ్యుదయమందిసుజనులహావణిఁ బ్రోచె, రాజధరరాజతాచలరాజభుజగ
రాజగోపాలకలశాబ్ధిరాజరాజ, రాజదతికీర్తి వేంకటరామమూర్తి. 75

క. ఆవేంకటరామప్రభు, దేవి విరులతావి సిరులదీవి యమృతపుం
బావి నెఱతీవిఁ దనరున్, వేవిధములవెంగమాంబ విశ్రుతిమీఱన్. 76

ఉ. ప్రోదిగవాసిరెడ్డికులమున్ గలిమిన్ వెలయించు సత్క్రియా
పాదినిపాపమాంబకును భవ్యయశుండగురాజమౌళికిన్
గాదిలిపట్టియై శుభవికాసమునం దగు వెంగమాంబకున్
మేదిని సాటిపత్తురె ఘృణిన్ హావణిన్ రమణీశిరోమణుల్. 77

సీ. పదినోళ్లభాషింపఁ బడురచ్చలకు నెక్కి పరమేష్ఠి నెలఁతయేభాష మెలఁత
నిలిచినచోటఁగా ల్నిలువకవర్తించు శ్రీమహాదేవి యేసిరులదీవి
చండియై తనప్రాణసఖునాటలాడించు గౌరీవధూటియే కళలజోటి
యడుగున్న కొకగుణం బనహెచ్చుతగ్గులై నలినొప్పుపృథ్వియే సాఁటిసాధ్వి
తే. యనుచునని చినకూరిమి నణఁగి మణఁగి, కలిమిలేమిని భర్తతోఁ గలసిమెలసి
హెచ్చుతగ్గుల నొకరీతి నెసకమెసఁగ, వెలసెవిలసితకీర్తుల వెంగమాంబ. 78

క. శ్రీవెంగమాంబికామణి, కీవేంకటరామనృపతి కిరువురుతనయుల్
శివింగటగిరిగుణగణ, భావితులై రామనృపతి పాపయ్యయనన్. 79

ఉ. మత్తగజంబులీలఁ జెఱుమామిళవేంకటరామశౌరిపు
త్త్రోత్తముఁడైన రామవిభుఁ డోహరి సాహరిశత్రుకోటిపైఁ
గత్తిజబీనదూసి యెసకంబెసఁగన్ జళిపింపనింపుమై
గుత్తపుఁదాపితాలివికటుట్టుపటుక్కున విచ్చె రంభకున్. 80

చ. అహహ పెరుంగురామమహిపాశ్రితదానపయఃప్రణాళిలి
ట్లహరహమేయులై పరఁగి రాశలభూభరమానుసామజ
ప్రహతకటీకటాహములఁ బర్వుచుఁ దన్నులెప్రీలఁజేయుఁ ద
న్మహిమములెన్నమిన్న మహిమండలిఁ గుండలిరాజమౌళికిన్. 81

క. శ్రీమీఱఁ దగ్గిదంద్రులు, నామమిడిరి వేంకటాద్రినాయఁ డనుచు నా
రామక్షితిపతితమ్ముని, ప్రేమంబాపయ్యయనుచుఁ బిలిచిరి పిదపన్. 82

సీ. ఒకవానరుఁడు నఖమ్మునఁబూనఁగలేక, మైనాకశైలంబు మగ్గె జలధి
నొకబ్రహ్మచారికోరికఁ దీర్పఁగాలేక బలి విన్నవైరసాతలముఁ జేరె
నొకనరుండెడదాఁక నోర్చుచీరములేక గిరిజాధినాథుండు క్రిందుపడియె
నొకజోగిగొన్నగ్రుక్కెడు మించఁదడిలేక కలశాబ్ధిరాజు భంగములఁబడియె
తే. నేటిధృతి యేటివితరణమేటిశౌర్య, మేటిగాంభీర్యమని నిరాఘాటధైర్య
దానశక్తిగభీరతానూనుఁ డగుచు, వరలువేంకటరాము పాపయ్యశౌరి. 83

క. శ్రీమచ్చెఱుమామిళకుల, సోమునకున్ బాపయప్రచురనామునకున్
గామినియిభగామినిశుభ, గామినిమీనాంబ తనరుఁ గలిమిన్ బలిమిన్. 84

సీ. ఆదిగర్భేశ్వరియని బుధుల్ వినుతింపఁ బుట్టుభోగములతోఁ బొలుపుమీఱి
యనుకూలదాంపత్యమనుచు లోకులు మెచ్చఁ దనప్రాణనాథుచిత్తమున మెలఁగి
పరమపావనియంచు బంధువుల్ తోషింప నిత్యవ్రతాచారనిరతిఁ బూని
భాగ్యశాలినియంచు భామినుల్ గణుతింపఁ గూఁతులఁ గొడుకులఁ గూర్మిఁ గాంచి
తే. శీవిఁదనరారెఁ బద్మాక్షి దేవికధిక, వైభవమ్ముల భాసిల్లు వాసిరెడ్డి
రామలింగేంద్రునకును గారాబుపట్టి, మృదులగుణమణిసిరులరంబ మీనమాంబ. 85

సీ. విలసదద్దంకితిర్మలతిర్మలాచార్యు నంఘ్రిపల్లవయుగం బాశ్రయించి
హరివాసరశ్రీసదాచారకలనంబు నిత్యవ్రతంబుగా నిర్వహించి
సత్తటాకవనాదిసప్తసంతానముల్ సమధికోత్సాహుఁడై సంఘటించి
హితపురోహితసమాహితసమాహితముగాఁ బురుషోహారియటంచు ఘూర్ణిఁబంచి
తే. ధనకనకవస్తువాహనధాన్యపుత్త్ర, పౌత్త్రదీర్ఘాయురారోగ్యభాగ్యమహిమ
తీఁదనరారుమీనాక్షిదేవితోడ, మహితతేజుండు పాపయక్ష్మావిభుండు. 86

వ. వెండియుం హృద్యానవద్యపద్యసద్యోతకవిద్యాసముద్యమోద్యద్విద్వన్నికరసుకరాశీ
ర్వచనరచనాప్రచీయమానసంపత్పరంపరాపూర్ణుండును రణాగ్రవ్యగ్రనిజభుజాగ్రజా
గ్రన్మండలాగ్రప్రసారోత్సారితరిపుమండలహిండితచండమరీచిమండలుండును సిరం
తరనిరంతరాయనిశ్శ్రేయసనిర్విశేషసమారబ్ధసప్తసంతానపరిపూరణస్ఫురణపరిణత స
ముత్సాహదోహలుండును శ్రీవెంగమాంబికాగర్భశుక్తిముక్తాఫలుండును బైఁడిపుల
గోత్రపవిత్రుండును బావనచరిత్రుండును నగు శ్రీ చిఱుమామిళ్ల పాపయ్యప్రభుం
డొక్కనాఁడు పుత్త్రమిత్త్రామాత్యబంధుసందోహపరివృతుండై నిండోలగంబున
సుఖాసీనుండై సరససల్లాపంబులం బ్రొద్దు గడపుచు. 87

మ. నను రామానుజపాదపద్మయుగళీనవ్యావ్యయధ్యానపా
వనహృద్భాగవతావతంసపదసేవాసక్తచిత్తుఁ మరు
త్తనయారాధనచారులబ్ధకవితాధారుఁ సదారూఢభా
వను నాస్థానకవిఁ నిజాశ్రితునిఁ బిల్వంబంచి పల్కెఁ గృపన్. 88

క. పౌత్త్రుఁడవై మైత్రేయస, గోత్త్రుఁడవై నారసింహగురువర్యునకుఁ
బుత్త్రుఁడవై వెలయుదువీ, ధాత్రిఁ మాపనుపు సేయఁ దగు కృష్ణకవీ! 89

క. అవ్యయభవ్యాపహమగు, కావ్యరచనమిదియు మేలు గాదే బుధసం
భావ్యము 'శివశ్రేయసే, కావ్యం' బనుసూత్త్ర మార్యఘటితం బగుటఁ. 90

వ. అదియునుంగాక యొక్క విశేషం బాకర్ణింపవలయు నొక్కనాఁటి హరివాసరప్రతో
పవాసంబున విశ్రాంతయై యున్న మజ్జననిచరణారవిందంబులకుం బ్రణమిల్లి కృతాం
జలిపుటుండనై యున్న నన్నుం జూచి వత్సా! సప్తసంతానంబులయందుఁ గృతిం బడ
యుట విశేషలాభంబనియుం మహారాజన్యచరిత్రంబు కలిదోషనాశకంబనియు నాము
ష్మికఫలప్రదంబనియును బెద్దలు నిర్దేశింతు రట్లగుం జేసి యెద్దియేనియు నొక్క రా
జన్యచరిత్రంబు కృతిముఖంబుగా రచియింపం జేసి వేంకటేశ్వరార్పణంబుగా నివేదిం
పందగు నిదిమదీప్సితం బని యాదేశించుటయుం నయ్యమ సెయ్యంబునకుం బ్రీతుండనై

జనన్యాజ్ఞానువర్తనంబు సలుపం బూనియున్నాఁడ భవత్సన్నిధానంబునం దొరకొనియెం గావున. 91

క. కృతికన్యాపతి వేంకట, పతియఁట కృతిభారతార్థపద్ధతియఁట యా
కృతి భవనిష్కృతియగునఁట, కృతివిగదా నీవు జగతిఁ గృష్ణకవీంద్రా! 92

వ. అని యివ్విధంబునం బ్రశంసించి తాంబూలస్వర్ణాంబరాభరణంబులం బరిష్కృతుం గావించిన నేనునుం బ్రహృష్టాంతఃకరణుండనై మత్కృతిపతి యగు శ్రీవేంకటాచలపతి నభివర్ణించెద. 93

సీ. ఏ దేవదేవునిసాదరాలోకంబు లోకంబులకు సౌఖ్యమాకలించు
నేపరాత్పరుదివ్యరూపానుభావంబు భావంబులకు మేలు పాదుకొలుపు
నేజగజ్జనకునియిచ్ఛావిహారంబు హారంబు ధారణీచారుముఖికి
నేమహాబలశాలిహేలావతారంబు తారంబువిష్టపత్రయమునకును
గీ. నేసుధీనిధికరిగాఁపులై సుఖింతు, రంగబంగాళచోళకళింగవంగ
గౌళపాంచాలనేపాళమాళవాంధ్ర, శకయుగంధరముఖ్యదేశములనృపులు. 94

శా. ఆవిన్నాణపువేలుపుం దొరఁ బ్రపన్నానీకముల్ గొల్వఁగా
శ్రీవైకుంఠపురంబు వెల్వడి లసచ్ఛృంగారుఁడై యిందిరా
దేవిం దోడ్కొని స్వామిపుష్కరిణికాతీరప్రదేశంబునన్
భావింపందగుహేమసౌధమున శుంభల్లీలఁ గ్రీడించుచున్. 95

సీ. ఆమోదమునరమారామాలలామంబు మెఱుఁగారుసురముపై మెఱపులీన
నహితలోకైకదుస్సహసహస్రారంబు లాలితంబగుచుఁ గెంగేలనమర
ఘనతరామలకనత్కనకోత్తరాసంగ దీధితియొడలిపైఁ దేజరిల్ల
భూరిగైరికచారుహీరకోటీరంబు కొమరారునుత్తమాంగమునఁ దనర
గీ. లలితధాతువిచిత్రశిలావిశేష, శేషగిరిశృంగశృంగారచితనిశాంత
బహుళమణిరాజరాజితభద్రపీఠి, సరసగతి వేంకటాచలస్వామి వెలయు. 96

## షష్ఠ్యంతములు.

క. ఏవంగుణగణభృతికిన్, కేవలవిద్యాభిరతికిఁ గిల్బిషహృతికిన్
భావభవాకృతికిన్ విజ, యావహపరిణతికి వేంకటాచలపతికిన్. 97

క. శంకృతికిన్ చితదైత్యా, హంకృతికిన్ మణిగణోజ్జ్వలాభరణకృతా
లంకృతికి రణజయానక, భాంకృతికిన్ మదనసదృశభవ్యాకృతికిన్. 98

క. శరదరశరదంబుదసుగ, తరుపరనిర్జరసరిత్సుధాకరకరస
త్పురహరహారగిరిగిరిచర, చరదురుతరతరుణకీర్తిశాలోదరికిన్. 99

క. శ్రీలునకుఘనఘనాఘన, నీలునకవనీవనీవనీపకరక్షా
శీలునకు నబ్ధికన్యా, ఖేలనలోలునకు శేషగిరిపాలునకున్. 100

క. ఖరకరకరగరవైశ్వా, నరనరహరిహరిఖరారినవశౌర్యకలా
భరణునకున్ సకలకలా, భరణునకున్ శేషశైలవరవరణునకున్. 101

వ. అంకితంబుగా నాయొనర్పంబూనినశకుంతలాపరిణయం బనుమహాప్రబంధంబునకుఁ
గథాక్రమం బెట్టిదనిన. 102

శ్రీరస్తు.

# ప్రథమాశ్వాసము.

## కథాప్రారంభము.

తే. తాలహింతాలతూలరసాలసాల, మాలకతమాలకృతమాలమాలతీల
తాలతాళికళద్రజస్థగితగగన, రామణీయంబు నైమిశారణ్యపదము. 1

క. ఆనైమిశవనభూమిని, శౌనకశాండిల్యముఖ్యసంయమివర్యుల్
పూనిమఖంబునసూతుని, మానితగుణజాతుఁ జూచి మది ముదమొదవన్. 2

వ. భారతకథాసుధారసంబు వీనుల నించుచు మమ్ముఁ గృతార్థులం గావించితి వందు శకుంతలాదుష్యంతోపాఖ్యానంబు సవిస్తరంబుగా వినవలయుం జెప్పుమనిన సూతుండు పరమహర్షసమేతుండై శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 3

మ. కలదుర్వీన్ బలగర్వితాహితకచగ్రాహగ్రహోద్యద్భుజా
ర్గళరాజద్ద్విజరాజగోత్రశిఖరద్రాజన్యసౌజన్యపు
ష్కలసద్వస్తుసమస్తహస్తినగరాఖ్యప్రఖ్యరాజన్యతీ
తిలకం బంగకళింగవంగముఖదిగ్దేశాధిపాశాస్యమై. 4

సీ. గురునైన భారతీవరునైన నోడించు విద్వత్ప్రవరులైన విప్రవరులు
హరునైన దంభోళిధరునైన దమకించు రాజద్ద్యుమణులైన రాజమణులు
ధనునైన మనుజవాహనునైనఁ దలఁకించు నార్యాభిజనులైన యర్యజనులు
హరినైన గంగాలహరినైన విహసించు బాహువిభవులైన పాదభవులు

గీ. వేదవిద్యాప్రభావభావితవితరణ, పరిణతయశఃప్రసారవిస్ఫారులగుచు
నలువుమీఱుదు రగ్రవర్ణములధీరు,లాజవంజవధారులా రాజధాని. 5

ఉ. నందితనూత్నరత్నవరణప్రతివాసరచంద్రచంద్రికా
కందళదిందుకాంతఫలకస్రుతపాండురవారిపూరముల్
చెందఁగ నందమై పరిఖ చెన్నెసఁగున్ నిజవంశరాజసం
క్రందనులున్నతన్నగరిఁ గాచు సుధాజలరాశి కైవడిన్. 6

మ. స్ఫురదాకాశతరంగిణీమధురవాఃపూరమ్ములం ద్రావఁగాఁ
గరమభ్రమ్మునకెత్తి హత్తినమహాగంధేభరాజంబనన్

హారినీలద్యుతితీవ్రవప్రవలయంబై యున్నతద్వారగో
పురమై హస్తిపురంబు పేరునకుఁ బెంపుం గూర్చు నశ్రాంతమున్. 7

సీ. చూపట్టునొకవీథి సుకుమారతరపద క్రమణమాతంగచంగములగములు
కనుపట్టునొకవీథి ఘణఘణక్వణరణ ద్ఘంటికాశతళతాంగములగములు
పసిమీఱునొకవీథిఁ జక్రచంక్రమణాది గమనదుర్గమతురంగములగములు
మొనసూపునొకవీథి ఘనభుజార్గళనిర ర్గళవాహినీపురోగములగములు

గీ. తివురునొకవీథి బధిరితదిగిభరాజ, కర్ణకోటరపాటనక్రమసముగ్ర
పటహడిండిమభేరికాపణవమర్ద, ళప్రముఖహృద్యవాద్యకోలాహలములు. 8

సీ. ప్రసవాసవాసంగలసమానమదభృంగ విసరైకశృంగారరసలవంగ
మనుభూతఫలసారఘనశుకవ్రజభార వినమితఫలపూరవిటపివార
మతనుకేళివిలోలసుతనుపల్లవజాల కృతనివాసతమాలతతవిశాల
మతులకోకిలపోతధుతపల్లవవ్రాత నతలతాసంఘాతవితతచూత

గీ. మానమితచంచులసనకాలీనకలహ, కలితకలకలకలరవకులకులాయ
రంగదుత్తుంగతుంగనారంగరంగ, మలరునప్పురపరిసరోద్యానవనము. 9

సీ. కులుకుగుబ్బెతగబ్బిగుబ్బపాలిండ్లపై వలపులీనుజవాది మెలఁగి మెలఁగి
యలసౌధములవన్నియలముద్దియలజాది యలరు శయ్యలఁ జేరి యలరి యలరి
బెరసిపుప్పొడిగ్రమ్ము పెరటిలేమరువంపుఁ దరులపందిరులపైఁ బొరలి పొరలి
మరుకేళినలయుకోమలికపోలములపైఁ బునుఁగుఁజెమ్మటలతోఁ బొదలి పొదలి

గీ. సరసపరిసరకాసారసారసార, సవిసరసరణిపరితఃప్రసరణభరిత
పరిణతపరాగపరిమళపవనడింభ, మోజ నలరించు మించు నా రాజధాని. 10

ఉ. కుంతలకేరళద్రవిళకోసలసింహళగౌళమాళవా
శ్మంతకరూశఘూర్జరదశార్ణకళింగశకాటమేదినీ
కాంతకిరీటరత్నఫలకప్రతిబింబితపాదుఁడైన దు
ష్యంతుఁడు తండ్రితాతలక్రియన్ ధృతినప్పురమేలు ధీరుఁడై. 11

సీ. ఏరాజు భేరికాభూరినిర్ఘోషంబు ఘోషంబు నరఁ జేయుఁ గుటిలనృపుల
కేరమ్యగుణశాలిభూరిప్రతాపంబు తాపంబుగూర్చు నధర్మరతుల
కేమేటినిజభుజాధృతచంద్రహాసంబు హాసంబుగావించు నశనిధార
కేధన్యువితరణసాధుసంకల్పంబు కల్పంబునకు వెలికాంతి నెఱపు

గీ. నతఁడు కేవలనృపుఁడె క్రూరాట్టహాస, చకితచకితాహితాహితస్వర్ణపూర్ణ
విశ్వవిశ్వంభరాధురావిధురతరభు, జాగ్రజాగ్రద్బలుండు దుష్యంతవిభుఁడు. 12

సీ. కొదదీఱవానలు గురియుఁ బర్జన్యుండు జగతిముక్కారుసస్యములు పండు
గ్రామముల్ ధనధాన్యకటకంబులై యుండు నఱిమి ధేనువులు చన్నవిసిపిండు

బ్రాహ్మణోత్తములకు బాధలు లేకుండు నిత్యోత్సవంబులు నెగడుచుండు
వంధ్యలకాత్మజావాప్తిఁ గోర్కులు నిండు తరుల నెప్పుడు పండ్లుతనిగనుండు
తే. దరతమంబులఁ దామరతంపరనఁగఁ, బూలచేరెత్తినటు పతిభూప్రజలకు
సత్తరోత్తరమభివృద్ధియొలయుచుండు, నెలమిన ధాత్రి దుష్యంతుఁడేలు నపుడు. 13

వ. వెండియు నమ్మహీమండలాఖండలుండు రాజ్యంబు పాలించుచు గురుజనంబుల యెడ వినయ్యంబును సామంతులయెడ నెయ్యంబును మిత్రులయెడ మోదంబును శత్రుల యెడ భేదంబును బౌరులయెడ లాలనంబును బ్రజలయెడఁ బరిపాలనంబును శిష్టుల యెడ ననుగ్రహంబును దుష్టులయెడ నిగ్రహంబును జారులయెడ నన్వేషంబును శూరులయెడ సంతోషంబును నీతిశాస్త్రంబులయెడ శ్రవణంబును సదాచారంబుల యెడఁ బ్రచరణంబును ధర్మసూక్ష్మవిశేషంబులయెడ సాభిముఖ్యంబును ధర్మేతరంబుల యెడ వైముఖ్యంబునుం గలిగి దిగ్విజయసమాసాదితోపచయరథకరితురగభటవిహార సంకులంబు నక్కరినగరంబునం బితృపైతామహం బగు రాజ్యంబు పాలించుచు నొకనాఁడు మహార్ణవమణిగణకిరణచ్ఛటాకంచుకితకాంచనసమంచితస్థూణాసుందరం బగు నాస్థానమందిరంబునఁ బురోహితవిద్వత్సామంతమంత్రిప్రభృతు లిరుగెలంకులం బలసికొలువ సింహాసనాసీనుండై పేరోలగం బుండు నవసరంబున. 14

సీ. నెఱిసంజకెంజాయ నెరసు తెన్నేదుపల్ల జడలతోఁ గరువంపునడలతోడఁ
దివుట తియ్యని తేనె దివురుప్రామినుతుల పలుకుతో వజ్రంపుఁజిలుకుతోడఁ
బరమభాగవతసంపదమీఱునూర్ధ్వపుండ్రములతోఁ జక్రచిహ్నములతోడ
మందానిలాఘాతకందళన్మహతీస్వనములతో హరికీర్తనములతోడ
తే. జడమతులఁదీర్పు నుత్తమజ్ఞానఘనుఁడు, ధర్మసూక్ష్మార్థనిర్ణయతత్పరుండు
లోకసంచారి కాలత్రయీకథావి, శారదుఁడు వచ్చె నచటికి నారదుండు. 15

తే. దేవమునిరాక విని ధరిత్రీకళత్రుఁ, డెదురు చని భక్తిఁ బదముల కెఱఁగి రత్న
చిత్రితవరాసనమున నాసీనుఁ జేసి, యర్ఘ్యపాద్యాదిసత్కార మాచరించి. 16

వ. కుశలప్రశ్నపూర్వకంబుగా బహువిధసంభావనావచనంబుల నమ్మహాత్మునిచిత్తం బారాధించి తదనుమతి నుచితపీఠంబునం గూర్చుండి కొండొకతడ వజ్జడదారిపలుకు లకుఁ బ్రహృష్టాంతరంగుండై యమ్మునిపతి ముఖకమలంబునం జూడ్కి నిలిపి సవిన యంబుగా ని ట్లనియె. 17

ఆ. ఎచటనుండి మీర లిటకు విచ్చేసితి, రేమికతము చెప్పవే మహాత్మ!
మిమ్ముఁ జూడఁగంటి మీదనూర్ధ్వదృష్టిచే, నభిమతార్థలాభ మందఁగంటి. 18

వ. అనిన దరహసితముఖుం డై నారదుం డి ట్లనియె. 19

మ. పురుహూతప్రముఖామరాధిపకళాపూర్ణప్రభాశాలివై
నరనాథుం డుదయించునట్టిఘను సన్మానంబునం జూచుటే

పరమార్థం బనితోఁచున ట్లగుట భూపాలాగ్రణీ! మాకు నె
వ్వరితో నేమగుధర్మవత్సలుల మై వర్తింతు మే మెల్లెడన్. 20

వ. అట్లుంగాక యింద్రాదిదిక్పాలకసందర్శనంబును గంగాదిపుణ్యతీర్థాచరణంబును గురు క్షేత్రాదిపుణ్యక్షేత్రావాసంబును గాంచ్యాదిదివ్యస్థలావలోకనంబును భవాద్భుశమహా రాజాధిగమనంబును మాకు నవశ్య కర్తవ్యంబు లైననొకవిశేషంబుగలదాకర్ణింపుము.

సీ. శ్రీమహాదేవీలలామంబు నైదోడు వేవెలుంగులవేఁడివెలుఁగుజోడు
యామినీకామినీకామనుం డగువేల్పు చిన్నారిపొన్నారిజింకదాల్పు
కటికిచీఁకటులనొక్కటఁ ద్రుంగుజగజెట్టి కలశపాథోరాశిగన్నపట్టి
మేటిదేవతలకామెత లొసంగెడుప్రోడ తొగవాలుగంటికిఁ దోడునీడ

తే. కడిఁది జడదారిసిగపూవు కళలప్రోవు, మెలపులకు సీమ కాముని మేనమామ
కత్తివేల్పుమఱంది భోగములగొంది, రిక్కగమిమక్కువబోజుంగు రేవెలుంగు. 22

క. కాంచెన్ మృగలాంఛనుఁ డొరు, నంచితనయుఁ దనయుంబుధుఁ బదానతవిబుధున్
బ్రాంచితనుతిఁగనుసుతుఁగని, పెంచెంబురూరవు బుధుండు భృతగౌరవుఁడై. 23

చ. ఒనరఁ బురూరవుండు దనయుం దనయున్నతిఁ గాంచె నాయువున్
ఘనుఁ డతఁ డాత్మజున్ బడసెఁ గంతు జయంతు జయింతు నన్నడన్
గనదనురూపరూపయుతుఁ గానహుషున్నహుషుండు గాంచె నొ
య్యన భుజశౌర్యశీర్యదభియాతియయాతి నయాతి బాలసున్. 24

వ. మఱియుం నయ్యయాతికిఁ బూరుండును బూరునకు జనమేజయుండును జనమేజయుంన కుఁ బ్రాచీశుండును బ్రాచీశునకు సంయాతియు సంయాతికి హసంయాతియుం హాసం యాతికి సార్వభౌముండును సార్వభౌమునకు జయత్సేనుండును జయత్సేనునకు సురా చీనుండును సురాచీనునకు మహాభౌముండును మహాభౌమునకు నయుంతానియుంతుండు ను నయుంతానియుతునకుఁ గ్రోధుండను గ్రోధునకు దేవాపియుం దేవాపికి రుచికుండు ను రుచికునకు మతివరుండును మతివరునకుఁ ద్రసుండును ద్రసునకు నీలుండునుం గలిగిరి. యన్నీలునకు రథంతరాదేవివలన నుదయించి సోమాన్వయంబు కీర్తిపౌరుషం బుల కగ్రగణ్యంబుగా వెలయించు మహాభాగుండవ ట్లగుటం జేసి. 25

సీ. ఒకతాత కువలయాహ్లాదకరంజనంబున నఖిలలోకములరా జై తనర్చె
నొకతాత విద్యాసముద్యమాపాదియై యతిబోధమున బుధుం డనఁగ నెగడె
నొకతాత భూమిభృన్నికరశాసనమున నధికుఁడై ప్రాచీశుఁ డనఁగఁ బరఁగె
నొకతాత దినదినప్రకటదానంబున మని సార్వభౌముఁడై మహిరహించె

తే. నొకఁ డొకనికన్న మిన్నయైయున్నతంపుఁ, బెంపుడఘకొత్తఁ బ్రజలను బెంచి మనిచి
ఘనుల మును లాచరించుదీవనలఁ దనరి, రదిగదా నీదుసంప్రదాయము కుమార! 26

క. శైలంబుల్ శైలం బిరు, గేలంగిలించివాళిఁ గేళీగతులం
దాళగతింజఱచితివో, బాలుఁడవైయాడునాఁడు బలిమికలిమిచేన్. 27

తే. వనులఁ గ్రీడించుదుష్టసత్త్వములవలన, నాశ్రమమ్ములనొందవెమహాశ్రమమ్ము
వెడలుమద్ధవికినిపుడ కావింపుమింపు, తాపసహితాప్తిమాకుఁ బ్రతాపసహిత ! 28

వ. వినుము ధరణీవలయపరిపాలననిష్ఠాగరిష్ఠు లగునృపశ్రేష్ఠులకు శాస్త్రసమ్మతం బగుట మృగవ్యం బవశ్యకర్తవ్యంబు గావున నారణ్యకభటపరివృతుండవై గిరితరుకంటకశిలాదుర్గంబు లగుమార్గంబులు నిరోధించి శరభశార్దూలాదిదుష్టసత్త్వంబుల సంహరించి యాశ్రమంబులకు సౌఖ్యం బాపాదింపు మమ్మహామునుల యనుగ్రహంబునం జక్రవర్తిలక్షణలక్షితుం డగుకుమారుం డుదయించి వంశకరుం డగునని యాదేశించినం బ్రమోదపులకితస్వాంతుండై దుష్యంతుం డట్లకాకయని యంగీకారపూర్వకంబుగాఁ బ్రణమిల్లి వీడ్కొల్ప నాశీర్వచనముఖరముఖుండై యామంత్రణం బాచరించి యంతర్ధానంబు చేసినం బదంపడి యప్పుడమిఱేఁడు మృగయావినోదకౌతుకాయత్తచిత్తుండై యుండునవసరంబున నిదాఘంబు వర్ధిల్లుటయుం. 29

సీ. భానుఁడన్ పూర్వాబ్ధిబడబాగ్ని కెదురుకోల్పచరించు నపరాబ్ధిబాడబంబో
పొడిచిరారవిఁ జీరుపూర్వేద్ధ్యురవసాన చరమాద్రిదవనివిష్టజ్వాలనమొ
ప్రతిమాధవోత్థమైప్రబలిదిక్కులనేర్చు నాఖిలనృహరికోపానలంబో
ప్రాక్సపత్నిఁగరంచుభర్తఁజూచిప్రతీచి యొలయించువేఁడినిట్టూర్పుగమియొ
తే. తరతమంబులఁదఱుగనిత్రంపిగాఁగఁ, దపనతపనీయమాతపతాపవహ్నిఁ
గ్రాఁచుకాలకళాదుపూర్తాకృరచయమొ, నాఁగఁదగెఁబశ్చిమానిలోగ్రాగమంబు.

మ. లలి నుర్వీతలముంబగిల్చి నభమెల్లందానయైయుమ్ములం
గలకీలాలపుజాలు మేలుడిపి తన్గ్రాఁచన్ దలంపన్ మహా
బలునవ్వేసవివహ్నిదాశరణముల్ బ్రాధించితన్నైత్రిను
జ్జ్వలుఁడై నాఁటనుగోలెవాయుసఖుఁడన్ ప్రఖ్యాతిఁగాంచెన్ ధరన్. 31

మ. అహాహా లోకములేకొలంది మనుఁ గీలాఖిలవాతూలదు
స్సహమైతీండ్రిలుమందు వేసవికి నీశశ్రీశవాగీశుల
న్నహమున్ మూర్ధమునందు శయ్యనిగమవ్యాపారపాత్రంబునన్
బహుమానింతురు వారిఁదత్సమయతాపశ్రాంతిశాంత్యర్థమై. 32

ఆ. పగలువిస్తరించిమిగులవేఁడిమిసూపు, తపనుఁజొరకచాయతరులనీఁగెఁ
బరమసాధ్వియయ్యుభర్తవెన్నాడెనే, తగనిశిక్షసేయఁదగదు పతికి. 33

తే. సూర్యుఁడునిజప్రతాపంబుసూపసూర్య, కాంతములు రేఁగిసిప్పులుగ్రక్కఁదొడఁగె
నినుఁడుకోపింపఁ బరివారమినుమడించి, కడిమిసూపుటధరణినిక్కంబకాదె. 34

సీ. యంత్రధారాగృహాభ్యంతరాళములందు వరపర్ణినీపయోధరములందుఁ
గమనీయగోస్తనీకాయమానములందు ఘనసారకదళికావనములందు
బహుపాదపాదపప్రబలవాటికలందుఁ గాసారతీరసైకతములందు
మల్లీమతల్లికావల్లీగృహములందు నికటపానీయశాలికలయందుఁ

ఆ. బరువమగుపండువెన్నెలబయళులందుఁ, దరళితమృణాళతాలవృంతములయందుఁ
గేవలాసక్తులగుచుభోగింపమరిగి, హాయరామందువేసవిఁ బతులుసతులు. 35

తే. అటనభంబునడంబయ్యెనంబుదంబు, పశ్చిమంబుననింద్రచాపంబుదోఁచె
నొలసితూరుపుగాడుపులుత్తరమున, నవనవతటిల్లతావితానంబుబెరసె. 36

సీ. తపముపెంపునఘోరతమమైదిశలఁబ్రాఁకి జలజబాంధవుఁగప్పుశార్వరంబొ
కేశినీవృత్తభంగికిఁగూర్చుమెఱపులన్ గరదీపికలఁజేరుకజ్జలంబొ
పర్జన్యశరణంబుప్రాపించిగఱులతోఁ జదలఁగ్రుమ్మరుశిలోచ్చయచయంబొ
ధరణీధరములేర్చుదవహవ్యవహానున వెడలుధూమస్తోమవిస్తరంబొ

గీ. యోగశయ్యాభిముఖముగానొలయఁజూచి, శ్రీమహావిష్ణుపదముఁగైసేయఁటకును
వెడలునిద్రావధూటిమైవిలసనంబొ, నాఁగనభముననడరెసునాఘనంబు. 37

క. తళతళమెఱసెన్ మేఘము, పెళపెళనుఱిమెన్ నభంబుబిఁటలువాఱం
బలపలగురిసెన్ వర్షము, జలజలనిలనింద్రగోపజాలమురాలెన్. 38

తే. తపమునకువిఘ్నకరియించుఁదలఁపఁడర్కుఁ, డొలయుంవర్షావధూటిపయోధరముల
వేయికరములనింపెనవ్వేడబమున, నపుడ శాంతించె నతనిమహాతపంబు. 39

ఉ. మించెఁదళత్తళద్రుచులుమీఱిమెఱుంగులమొత్తముల్ విడం
బించెదిగంతరాళములభీతికృదూర్జితగర్జితధ్వనుల్
నించెఘనాఘనంబు ధరణీవరణంబునభూరివారి న
ర్తించె మయూరవారము పరిస్ఫుటబర్హసమర్హణార్హమై. 40

శా. ఆస్యాయంబున హెచ్చిగ్రీష్మబుతురాజశ్రాంతమున్ భోజనో
దస్యాతాపమునేర్పరింపఁగనిక్రోధస్ఫూర్తిగర్జిల్లిప
ర్జన్యుం డభ్రరథస్థితిన్ మణిగణచ్ఛాయల్ దలిర్పన్ మహా
జన్యస్థేమముసూపెనో యన శరాసారంబు పర్వెన్ వడిన్. 41

వ. వెండియుం బుటపాకభాస్వరకార్తస్వరలతావితానంబులతెఱంగునం దుఱంగలించు
మెఱుఁగులమొత్తంబులును, మెఱుంగులమొత్తమ్ములతోడ నుదాత్తమ్ములై మందర
మంథానమథనపరిక్షుబ్ధదుగ్ధజలనిధినిర్ఘోషంబులవిధంబున నూర్జితంబు లగుగర్జితంబు
లును, గర్జితంబులతోడం బరిస్ఫూర్జితంబులై దశముఖసంగ్రామసమయసమ్మోహాన
సముద్దామరామకరలాఘవవినిర్గతశరాసారంబులకరణి ఘోరంబు లగుధారాళధారా
ధరధారాసారంబులును, ధారాసారంబుల ధరాపరాగంబులు దుర్దమంబు లగుకర్దమం

బులైనకోలంది నిలువక జాలువాఱి కాలువలై నిలుక లీక తెప్ప దెరలం బొరలుజల ప్రవాహంబులును, జల ప్రవాహంబులతరణంబులకుఁ గరణంబులులేక యిరుగడలం బడలుపడి పడిగాఁపులై యుండు యధ్వన్యులును, నధ్వన్యు లగుపతులయోగక్షేమసమన్వేషణంబు లగుభాషణంబుల ముఖరంబు లగుముఖంబుల విన్నఁదనం బొలయ నిట్టూర్పు నిగుడ్చుచుఁ దదాగమనంబున కెదురుసూచుకుటుంబినులును, గుటుంబినులధారణంబులకుం గారణంబు లయినకృషివ్యాపారంబుల నపారంబులగు హాళహాళికలం జెలంగు ప్రబలహాలికులును,హాలికులపరిశ్రమంబులం బ్రశస్యంబు లగుసస్యంబుల నుదారంబు లగు కేదారంబులును, గేదారంబుల సమృద్ధి నభివృద్ధిం గాంచువరగ్రామంబుల శుభసన్నివేశంబు లగు దేశంబులుం గలిగి వర్షాగమంబు సుగమంబై ప్రవర్తిల్లునవసరంబున. 42

క. వచ్చెఁ శరదాగమ మొగి, విచ్చె న్నేత్రాంబుజములువిష్ణుఁడు ధరపై
హెచ్చెఁ గాన పనంబులు, మెచ్చెఁ బశువిసర మెసఁగి మెసవుకసవులన్. 43

చ. కొలఁకులు దేటఁ బద్మినులకుంగను వేఁదుఱుదీఱె మేఘముల్
వలఁకులఁ జేఱఁడెం గలను వంకలఁ బంకములాఱెఁ భేకికా
హాళహాళికంబులూరెఁ గలహంసరుతమ్ములుమీఱెఁ గేకినుల్
వెలవెలబాఱె సస్యము నవీనరుచిం దనరారె నత్తఱిన్. 44

చ. ఆరయవితీర్ణిచే ఘనత నంది పయోదము ఘోరఘోషవి
స్వరత నపంకజీవన మొసంగె జనంబులకేటిధర్మము
ర్వరనిఁకవారికల్మషము వాఁపెదనంచు రహించెనో యనన్
శరదృతువొప్పెనొ హృదయసమ్మద నిర్మలవారిపూరమై. 45

వ. ఇత్తెఱంగునం దుఱంగలించి శరద్వాసరంబు భాసురం బగుటయుం నారదమహాముని వాక్యంబులం బుట్టినయాగ్రహావేశంబున దేశంబులయోగక్షేమంబులఁ దేరంబనిచిన చారు లాదుష్యంతునకుం బొడసూపి జయజయశబ్దపూర్వకంబుగా మ్రొక్కి—మహారాజ శిఖామణీ! దేవరయానతి నలుదెసల యోగక్షేమంబులరసివచ్చితి మమ్మహామునివాక్యంబు లనృతంబులగునే కరికిరి తరక్షుహర్యక్షప్రముఖంబు లగుసత్త్వంబుల గిరితరంగిణీతటోద్దేశంబులు దుష్ప్రవేశంబులై యున్నయవినయాచరణపరిణతసత్త్వాపితరణంబున నార్తులకు శరణంబ వగుము. 46

చ. లలదురు కాశచామరవిలాసము పొందు రపంకజాతప
త్రలసనముం బొనర్చుచు శరద్రమణీమణితోడుసీడగా
వెలువడివెంటనంటి యటవీతటవీథుల సత్త్వకోటులన్
వెలకొనసీకతుండవఁ దగు నీలకుమారకుమార విక్రమా! 47

క. అనిచారులువినిపించిన, వినివారలఁగనిపాసించి విభుఁ డిట్లనియెన్
ఘనధాటిన్ వనవాటిన్, గొనగోటన్ సత్త్వకోటిఁ గ్రమ్మెదనెమ్మిన్. 48

క. రాఁ బనుపుఁడు పార్వతికులఁ, దేఁ బనుపుఁడు తెఱఁగుపఱిచి తేరిటసఖుపం
గాఁ బనుపుడు జయభేరిన్, వేఁ బనుపుఁడు కర్మకరుల వేగిరపఱుపన్. 49

ప. అని యివ్విధంబున. 50

క. ఆఖేటమునకు ధాత్రీ, లేఖర్షభుఁ డనుమతింప లేలెం డనుచున్
శ్లాఘించుచుఁ బడవాళుల, లాఘవమునఁ బనిచి రగ్గలంబుగఁ జారుల్. 51

ప. తదవసరంబున. 52

మహాస్రగ్ధర. మృగయాప్రస్థానభేరిన్ మిగులఁ జఱచినన్ మీఱుఘోషంబు పేర్మిన్
గగనంబున్ భూతలంబున్ గడగడ వడఁకున్ గంధులింకెన్ దలంకెన్
దిగిభశ్రేష్ఠంబు లెల్లం దిరదిరదిరిగెన్ దేవయానోత్తమంబుల్
నగముల్ ఘూర్ణిల్లె నానానగచరవరముల్ నద్దెసల్ ప్రాఁకె భీతిన్. 53

ప. మఱియు నజ్జనపతి మజ్జనం బాచరించి చీనాంబరాభరణమాల్యాంగరాగంబుల నలం
కృతుండై కాల్యకరణీయంబులు దీర్చి యగ్నిసమారాధనంబు నడపి గోభూహిరణ్యా
దిదానంబుల బ్రాహ్మణులం దనిపి భక్ష్యభోజ్యంబులం దృప్తుండై తనుత్రాణశిరస్త్రాణం
బులు దాల్చి సన్నద్ధుండై భూసురాశీర్వచనపూర్వకంబుగా శుద్ధాంతంబు వెలువడి
కక్ష్యాంతరంబులు గడచి యేనుంగుమొగసాలకుఁ జేరం జనునవసరంబున. 54

సీ. మెఱుఁగువజ్రములఁ బమ్మినకమ్ములనుసుగాఁ గలకలధౌతచక్రములతోడఁ
బచ్చరా మొసలివాపవడంపునొగలపై నొఱపైనజలపోతయుంగముతోడఁ
బసిఁడిచట్టపులోవ పద్మరాగముల చప్పరము చెక్కడపుఁగంబములతోడఁ
నీలంపుటిరుసు టండికనమర్పఁ దలిర్చు కెంపురామలుపుఁ డెక్కెంబుతోడఁ
తే. గోసలజగజంపుముత్యాలగొడుగుతోడ, నిగనిగత్పుష్యరాగఘంటికలతోడఁ
జతురవల్గనవల్గదశ్వములతోడ, సారమగు తేరు సారథి చేరఁ దెచ్చె. 55

ప. ఇవ్విధంబున సారథి తేరాయితంబు సేసి తెచ్చిన. 56

చ. వలగొని మ్రొక్కుచుం జతురవైఖరి నారథతల్లజంబుపై
నెలకొని రా ధరాపతికి నెయ్యమెలర్ప నివాళు లిచ్చుచున్
జెలువము మీఱఁ గ్రొవ్విరుల సేసలు చల్లిరి భామినుల్ సిర
గ్గళజయభేరికాపటహకాహళముల్ మొరయం బొరింబొరిన్. 57

ప. ఇట్లు మదద్విరదరథతురగసైనికనికరదుర్గం బగు రాజమార్గంబున మందగమనంబునం
బురందరవిభవంబునం జనిచని పురంబు నిర్గమించి. 58

చ. పరిఘభుసుండికాముసలపట్టిసకుంతకుఠారశూలము
ద్గరకరవాలతోమరగదాశరచాపకఠారధారులై
పరిగొని యగ్రభాగమునఁ బార్వతికుల్ నడవన్ మహీతలే
శ్వరుఁడు రథస్థుఁడై కుసుమశాలివనాలి వయాళి వెల్వడెన్. 59

వ. ఇట్లు ఘోరంబులగు కాంతారంబులు ప్రవేశించి యప్పుడమిఱేఁడు వీరభటులం
బురికొల్పిన. 60

సీ. ఘుర్ఘురధ్వనులఁ దార్కొనువరాహంబులఁ గడఁదిబల్లెములతోఁ బొడిచిపొడిచి
కినిసి గోండ్రిలుచుఁ బైకొనుపంచనఖములఁ బారుటేఁటెల డిందుపఱిచిపఱిచి
కనికాండ్రుపొడిచి మార్కొనుసైరిభంబుల ముసలముద్గరముల మోఁదిమోఁది
ఘుల్లురంచు నెదుర్చుకంఠీరవంబులఁ జంద్రహాసంబులఁ జదిపి చదిపి
తే. గిరులచరులను దరులను దరులదుప్పుల, దొరలబొరలుచుఁ జెరలాడుకరులరురులఁ
గెరలిమరలినఁ దెరలినఁ దరలనీక, వెఱపుమఱి పేది పొడిచిరి వీరభటులు. 61

శా. ఆరాజన్యుఁ డుదగ్రుఁడై పొదివి సింహవ్యాఘ్రభల్లూకభూ
దారగ్రామికదుష్టసత్త్వసతతోత్థానంబు చాపస్ఫుర
న్నారాచప్రముఖాంబకంబులజడిన్వాయించుచున్ గ్రక్కునన్
ఘోరారణ్యపదాశ్రమంబులఁ బరిక్షోభంబు మాన్చెన్ గృపన్. 62

వ. ఇవ్విధంబునం బుణ్యనదీకూలంబులను కులకుధరపరిసరంబులను బావనాశ్రమనికటం
బులను బరిభ్రమించు క్రూరసత్త్వంబుల ననర్గళప్రకారపరిణత శరాసారంబులఁ బడలు
పడం జేయుచు. 63

క. ఘనసదమలపనపదములఁ, జనిముదమలరారదుష్టసత్త్వప్రతతిన్
మునిపదముల జనపదముల, ననుపదమును గెడల నృపతి యఱిమిఱి నఱకెన్. 64

ఉ. ఈరముఁ జెంత మేయుచు నొకయేణము నేసినఁ జూచి తత్ప్రియ
శ్రీరహిఁ బాసి వల్లభుని సేమముఁ గోరుచు నడ్డ మయ్యెఁ ద
ద్దారుణహృద్వ్యథం దెలిసి తాన దరించుశరంబు క్రమ్మఱన్
మారటఁ బూపునన్ దునిమె మానవభర్త దయాసమగ్రుఁడై. 65

క. గవయింగవయీడైతమిఁ, గవయంగవయంబుమీఁద గవగవగవియం
గవియించిన జాగిలములఁ, గవియంగానీఁడు భర్త కరుణాన్వితుఁడై. 66

క. కదళీదళములనీడం, గదళియుఁ గదళంబు నిదురఁ గైకొనఁ బొదువం
గదలెడుజాలరులంగని, కదలంగానీఁడు భర్త కనికర మొలయన్. 67

క. పున్నాగంబుల వలగొని, పున్నాగము విఱువఫణులు బుసబుసలాడన్
బున్నాగమఱుకనాన్నృప, పున్నాగము చూచిచూచి పొరిఁబొరి నవ్వెన్. 68

వ. ఇవ్విధంబున నమ్మహీకాంతుండు హేమంతశిశిరవాసరంబుల మృగయావినోదంబులం
దవిలి వర్తిల్లునవసరంబున. 69

ఉ. మావుల నేలుమన్నె దొర మందసమీరుని సంగడంబు నె
త్తావులతావు తామరలతంపరజాజి తొలంగుఁ బావలేఁ

దీవమిటారిజవ్వనపుదీముపికాళుల మెట్టపంటఁ గ్రొం
బూవిలుకానిసాహిణపుఁ బ్రోపరి యామని వచ్చె నత్తఱిన్. 70

సీ. తొలుదొల్తఁ బండుటాకులు రాలిననత్తి యొంచురెండిరువుల నొఱపుమీఱఁ
బదపడితలిరుజొంపములఁ దుంపెసలాడి పసరుమొగ్గలఠీవి నెసకమెసఁగ
వెనువెంటముకుళముల్ విప్పవాఱఁ దనర్చివిరులతండములతో విఱ్ఱవీఁగఁ
దోడ్తోడ నెత్తావిదొరయుపుప్పొడిరేఁచి కమ్మఁ దేనియసోనఁ గడలుకొలిపెఁ
తే. ప్రకటశుకపికశారీమధుకరనికర, సుకరకురవకమరువకాశోకకులక
తిలకసహకారముఖధరిత్రీరుహాళి, హాళిఁ బాలించునవవసంతాగమమున. 71

లయగ్రాహి.—
అందములఁ జిందుకురువిందములచందమునఁ గెందళుకులం దివిరి కందొవలవిందై
సందుగలయందొడుపుక్రొందలిరులందనరు పెందరులఁ జెందిచెలువొందువిరులందున్
గందళదమందమకరందరసముం దికొనిముందుతమసుందరులకుం దనుపుచుండా
రుందనిసిడెందమలరం దివమునం బెమొరయందగుమిళిందములబృందములక్రందుల్. 72

ఉ. గుమ్మనుకమ్మతెమ్మెరలకుందులకించి వసంతవేళలన్
గొమ్మలుకాననాంతరనికుంజములన్ జెలువారనొంటిమైఁ
బమ్మినరక్తిచే నెనయుపల్లవకోటులదూరనేలకో
కొమ్మనికూడి క్రొవ్వలపుఁ గూర్చెబళీసుమనస్సమూహముల్. 73

ఉ. ప్రీతిఁదలిర్చె మాధవుఁడు పెంపెసలారెడువేళభూమిరు
డ్జాతులకెల్ల నందు నొకజాతిరహింపక యున్కిఁజూచి త
జ్జాతిరహింపనిష్ఠురమిమంబునఁ గన్గొనఁడయ్యెమాధవుం
డా తెఱఁగట్లగున్ భువిననాశ్రితులం గణుతింతురే నృపుల్. 74

వ. ఆసమయంబున. 75

ఉ. మోదమొనర్చెఁ బుప్పొడులమ్రుగ్గులపై నొఱపైనమొగ్గలన్
గేదఁగిపూలటెక్కెములఁ గెందలిరాకులతోరణంబులన్
బ్రోదివహించుపక్వఫలపుంజములన్ శుకకోకిలాళిస
న్నాదములన్నికుంజభవనంబులనీలన్నృపాలసూతికిన్. 76

వ. ఇట్లు వసంతసమయసముచితకిసలయకుసుమవిసరసరసరసాలప్రముఖసాలరుచిరంబు
లగు నుద్యానంబులం జూచుచుం జనునమ్మహారాజునిరథవేగంబునకుఁ గాక సీరువట్టునం
బీఱువోయి సైనికు లంతనంత నిలిచినం జనిచని. 77

మ. అటఁ గాంచెన్ నరలోకవర్యుఁడు సమగ్రాశ్చర్యుఁడై మాలినీ
తటభూమిం బనసానసామ్రసరళ[illegible]త్తామ్లికాశాల్లలీ

వటసారంగలవంగలుంగలవలీవాశాదిశాఖిచ్ఛటా
రటదున్మత్తవిహంగచంగచయసంగళభ్రాజన్మహోద్యానమున్. 78

వ. ఇట్లనతిదూరవర్తియగునయ్యుద్యానంబుం గనుంగొని హృదయానందపోషంబులగు నందలివిశేషంబులకు నాశ్చర్యంబు నొందుచు సూతునితో నిట్లనియె. 79

క. ఆనందనవనముం బలె, నానందనఘూచగించు నశ్రాంతంబున్
దైనందినఫలకుసుమ, శ్రీనొందిన యుపవనంబు చిత్తంబునకున్. 80

సీ. ఘనసారఘనసారకదళికామోదంబు నాసాపుటప్రీణనం బొనర్చ
ఫలపూరఫలపూరమిళితామ్రజగలంబు రూఢిమై రసనకు రుచులు గొలుపఁ
గలకంఠకలకంఠకాకలీకలనంబు శ్రవణాంగ్రములరంజనమొనర్చ
వనజాతవనజాతఘనచాకచక్యంబు నయనాబ్జములకు నానందమొసఁగ
తే. సవిధవిధిభాగమక్రమప్రసపదంప, లసుమరసమగ్నమాలినీలలదభంగ
భంగశీకరసికరార్ద్రపవనడింభ, మువయపములకు నుల్లాసమావహించు. 81

క. జ్ఞానేంద్రియపంచకమున, కానందమొనర్చుచున్న యడవియట్లగుటన్
మానీశ్వరుఁ డొక్కరుఁడు, కాననమాశ్రమముగాఁగఁ గైకొనఁబోలున్. 83

సీ. తాపసార్భకకరప్రాపితాహారంబు రుచిచూచుగండభేరుండచయము
గండభేరుండముల్ కండూయనము చేయ జతగూడి క్రీడించుశరభవితతి
శరభచంగముల విస్ఫురదూరుపులమేలు లూని నిద్రించుపంచాననములు
పంచాననములతోఁ బరిచయంబులు చేసి భయమేది విహరించుభద్రకరులు
తే. భద్రకరికరశీకరప్రబలసేక, సరళకర్పూరకదళికాతరులనీడఁ
బొరలుమార్జాలములమీఁద నొరయుమెలుక, లద్భుతక్రమమైన యీయాశ్రమమున.

సీ. వేదాంతవాగర్థవివరణం బొకచోట నొకచోటనృత్యన్మయూరనివహ
మధ్వరక్రమసముద్యమఘోష మొకచోట నొకచోట మత్తాళినికరగీత
మభ్యాగతబ్రాహ్మణార్చనం బొకక్రీడ నొకక్రీడఁ బారావతకలరావ
మతిఘోరనియమసంయమిబాధ మొకపజ్జ నొకపజ్జ శారికాధికవిలాస
తే. మఖిలతంత్రస్వతంత్ర సంఖ్యావదగ్ర్య, గణ్యపుణ్యకథాసుధాకలన మొకట
నొకటనవకుంజపంజరశుకమృదూక్తి, శాంతశృంగారముల వేడ్కసలుపునిందు. 84

క. ఈయాశ్రమతిలకమునకు, సేయాశ్రమమైన ధరణినీడనఁదగు సే
పాయక తపమొనరించెడు, వేయేండ్లై సేయుచున్న యతఁడెవ్వరొకో. 85

క. ఆమునిసుత్రామునినభి, రాముని సేవింపవలయు రాజల్లలికా
ధామమ్మునఁ బ్రేమమ్మున, సేమమ్మున నిలుము హరులు సేదలుదేరన్. 86

క. అనుచుంజనుచున్ జనుచున్, మునిచంద్రునిఁ జూడఁ గోరి ముదమెదనొదవన్
దినసాథతేజుఁడగున, జ్జనసాథుఁడు తేరుడిగ్గి సత్వరుఁడగుచున్. 87

వ. ఇవ్విధంబున నన్నరపతి రథావతరణంబు చేసి విశాలరమణీయం బగులతామండపంబున
 రథంబు నిలుపునట్లుగా సారథిం బనిచి సవినయంబుగా నాశ్రమాభిముఖుండై నడచె
 ననవిని కుతూహలాయత్తచిత్తుండై జనమేజయుండు తరువాతిచరితంబడుగుటయుం. 88

చ. సనకసనందనాదిమునిసన్నుతపాద ! రమావినోద ! కాం
 చనమయవాస ! శత్రుజనశాసన ! దాసనమస్క్రియాప్రియా !
 వనరుహనేత్ర ! పత్రరథపత్ర ! పవిత్రచరిత్ర ! సామగా
 యనఘనశేషశైలనిలయా ! వలయాదివిశేషభూషణా! 89

పంచచామరము. పురాణభోగిభోగభాగ పుణ్యగణ్యనర్తనా !
 విరించిసంచితప్రపంచవిశ్రుతాత్మకీర్తనా !
 స్మరాతిసుందరాంగ ! సత్తమస్తమోవికర్తనా !
 చిరస్ఫురద్విశేషశేష ! శేషశైలవర్తనా! 90

గద్య. ఇది శ్రీమత్కౌసల్యానందనప్రసాదసమాసాదితకవితావిచిత్ర మైత్రేయసగోత్ర
 నృసింహగురుపుత్ర కృష్ణకవిప్రణీతం బైనశకుంతలాపరిణయం బనుమహాప్రబంధ
 మ్మునం దిష్టదేవతాప్రార్థనంబును, కృతిపతిగుణకథనంబును, గ్రంథావతరణంబును,
 దుష్యంతనారదసంవాదంబును, ఋతువర్ణనంబును, దుష్యంతమృగయావినోదనం
 బును మొదలగు విశేషంబులుం గలిగిన ప్రథమాశ్వాసము.

శ్రీ ర స్తు.

# ద్వితీయాశ్వాసము.

---



కర! రపభీకర! ర
త్నాకరగంభీర! పండితవశీకర! ద
ర్వీకరవరపర్యంక! గు
ణాకరమణివలయ! వేంకటాచలనిలయా! 1

వ. దేవా! వైశంపాయనుండు జనమేజయునకి ట్లనియె నట్లు దుష్యంతుండయ్యాశ్రమంబుఁ బ్రవేశించి యందలిమునికుమారులవలన నది కణ్వాశ్రమంబనియును నమ్మహాత్ముండు తీర్థయాత్రాచరణంబునకు వెడలె ననియును విని విఫలమనోరథుం డయ్యును నాంగికంబు లగుశుభసూచకంబుల నిరూపించుచు వధూజనసల్లాపంబు లాలించి యవ్విశేషం బన్వేషింపం దలంచి. 2

శా. ప్రాంచద్బాలరసాలమూలమున శుంభల్లీలనాసీనుఁడై
కాంచెన్ బార్థివమౌళి పూఁబొదలయిక్కం బక్వబింబాధరం
గించిత్కుంచితకుంతలన్ మణినిభాంగిన్ జక్రవాకస్తనిన్
జంచద్భ్రూయుగమధ్యనష్టమనిశాచంద్రాలికం బాలికన్. 3

తే. కాంచిమదనవికాసంబు గౌరవంబు, సాదరాలోకనము సంశయంబు మరులు
విస్మయంబును రాగంబు వెలుఁగుదోఁప, భావశబలాంతరంగుఁడై పార్థివుండు. 4

వ. ఇట్లు కనత్కనకరంభాసుభగంభావుకకదంబకమధ్యంబున ద్రాక్షాగుళుచ్ఛరింఛోళికా మధురమధురసామోదమేదురమధుకరనికరఝంకారసంకులం బగులవలీకాయమానంబు చేరువం గుసుమితలతావలంబనంబునం దనరు నవ్వనరుహాముఖిం గాంచి యనన్యకన్యాసామాన్యం బగునక్కన్యకామణిలావణ్యంబునకు నాశ్చర్యంబు నొందుచు. 5

క. శరణాగతభరణాతత, కరుణావరుణాలయుండు కమనీయసుధా
కిరణాన్వవాయమణి య, య్యరుణాధరఁ జూచి సందిహానుండగుచున్. 6

క. సురకన్యకయో విద్యా, ధరకన్యకయో నిజంబు తర్కింపఁగఁ గి
న్నరకన్యకయో కాకి, న్నరకన్యకలందు నిట్టినలువుం గలదే. 7

పంచచామరము. జగానిగారపున్ మెఱుంగుచాయలీను మేనిడాల్
మిగుల్ మొగుల్ మఱుంగుఁబాసి మించుమించులన్ జిగిన్
దగున్ సదంగభూతిచేతి దాతిరీతి మెచ్చుఁగూ
ర్చుగొంటువాలుఁగంటిజాడ జూడఁ గంటి నొంటిపై. 8

ఉ. ఏమహిళావతంసమున కేనవమన్మథమూర్తి కిట్టి క
న్యామణి గల్గెనో యతివరాశ్రమమంజులకుంజపుంజమి
శ్కోమలియాటపట్టగుటకుం గతమెయ్యదియో నిసర్గలీ
లామధురంబు లీవెలఁదిలక్షణముల్ గణుతింప నర్హముల్. 9

ఉ. ఆనడ లామెఱుంగుఁదొడ లాజిగిపొక్కిలి యానితంబ మా
కౌనలయారు నాబిగువుగబ్బిజగాచనుగుబ్బలాగళం
బానునుఁగేలు నాపెదవి యాకనుదోయిబెణంగు లాకురుల్
గాన జగంబునం గలువకంటి నొకర్తును గంటె నియ్యెడన్. 10

మ. తలిరుంబోఁడినితంబబింబవిలసద్ధమ్మిల్లబంధంబుతో
బలభిన్నీలము బోరి పూరిఁ గఱచున్ బాథోధరశ్రేణివె
ల్వెలఁ బాఱున్ గుములై మదభ్రమరముల్ నెత్తమ్ములం జేరు నె
మ్ములపింఛమ్ములుజాఱు నంధతమసంబుల్ బల్గుహల్ దూఱెడున్. 11

ఉ. ముందుపసిండితమ్మిబలు మొగ్గల మొగ్గర మావరించు మే
ల్పెంపెడువేల్పుగుబ్బలివజీరుని జీరు నఘగకరింపఁగాఁ
గ్రొందలిరాకుబాకుదొరకుం దొరకించు భవంబు చెల్లరే!
చందనగంధిచన్నుఁగవ చంద్రుఁడొ యింద్రుఁడొ యాయుపేంద్రుఁడో. 12

మ. స్ఫురదాపీనకటీరసైకతతటీసువ్యక్తనాభీసరో
వరమధ్యంబున రోమరాజి యనుశేవల్ బద్ధనాళాంకురో
త్కరముం దోఁచి వళీతరంగముల నూఁగంగుట్మలశ్రీపయో
ధరముల్ గ్రొవ్విరిలీలమోముభులచందంబక్కురుల్ గైకొనున్. 13

తే. కెంపుఁరాఁబోడితలిరుఁబాయంపుగుణము, పచ్చిపవడంపునిగనిగల్ భాగనియలిఁ
గూర్చి యమృతంబు పదనిడి ఘుటికచేసెఁ, గాక విధి యింత యొప్పునే కన్నెమోవి.

సీ. కణఁకనూర్ధ్వాధరాంగవిధానమున ధాతకరయంత్రణంబులఁ గ్రాగనోపు
నంతకంతకు నింతలైనగుబ్బలు విఱ్ఱవీఁగి పైఁబడు నంచు డాఁగనోపు
జఘనభారము ఘనస్తనభరం బని మోనఁ గ్రోయమధ్యస్థమై తొలఁగనోపు
గురుకళత్రంబులఁ గూడినపరితాప మెద కగ్గమైన వహింపనోపు

సహహా! సకలాంగ గౌరవం బావహించుఁ, దరుణిమంబూర్జితంబైన తరుణిమధ్య
మరయ నరయంగ నతికృశంబయ్యె మనవి, కనుసరించిన మదిమానఁ దనెడు కరణి. 15

కొమ్మ మెఱుంగుఁ జన్నుఁగవ కోర్కుల భిన్నములైన యాత్మకుం
భమ్ములఁ జూచి యాచనిసోబంగుఁ దొడల్ దొడరన్ వగర్చుహ
స్తమ్ములఁ జూచి తన్నుపదమ్ములు పుష్కరమూన వ్రాలు నా
గమ్ములఁ బ్రోవ బాలగజగామిని నున్ బికదంబుఁ గైకొనెన్. 16

ఒరపుం బూఁతపసిండి వంటిసునమే నొయ్యారపున్ మధ్యమున్
మెఱుగుం జెక్కులు లేనెలూరు పలుకుల్ మించుల్ పిసాళించువా
తెఱవిన్నాణము గుబ్బ ముద్దుమొగమున్ దీర్ఘైన ఫాలంబు బి
త్తరపుం జూడ్కి వలుందగుబ్బకవ వింతల్ గూర్చెఁ దన్వంగికిన్. 17

అని యివ్విధంబున. 18

నీలన్ఫాలసూతి రమణీమణి సన్నక సన్న వేచి దృ
గ్జాలము బాల ఫాలఫలకమ్ములఁ జెక్కుల గుబ్బచన్నులన్
గీలుజడన్నదన్ దొడలఁ గేల్గవ నైఁదలమైన యందమున్
మేలిధనంబు రాజునకు మెచ్చుగ మ్రుచ్చిలినించె నెమ్మదిన్. 19

బాలిక మోము చందురుని పై మధురం బగు మోవిజొంటి పై
నోలిఘన స్తన స్తబకయుగ్మము పై ననుఁ గేలుఁదమ్మి పై
హాళిఁగ బోల పాటికలనం పము గుల్కెడు వాడి పై మసీ
పాలుని వీక్షణభ్రమరపఙ్క్తులు గంతునిదున్ జెలంగులన్. 20

ఇత్తెఱంగున నక్కన్యకా పుష్పపరిసరదామోదవ్యతికరంబు లగు నీక్షణమధుకరంబుల
మరలింపఁ జాలక భూపాలతిలకుం డా సౌశ మాడ్కోలాయత్తం బయ్యెను జిత్తంబు గ
రొత్తం ప్రొత్తమరులునం గొలుచు నాత్మగతంబున. 21

చదురాడఁ బల్కమసితొఁ, చదురాడనశత్యమనుచు సదమదమయ్యెన్
మదిరాననశశమైనా, మది రాననశశమె మనసులు నురలు పసింకన్. 22

అకటకటా! మదీయహృదయంబన యంబునయుంబటించు నెం
చక యకలంక భావమున సంధిలు కణ్వమునీంద్రుపట్టిపైఁ
బ్రకటతరానురాగమునఁ బాయక యుండుట చిత్రమయ్యెఁ గా
తుకమున నిందువంశజులు దుష్టవిచేష్టితమున్ భజింతురే. 23

శా. అని ధాత్రీనాథుఁ డంతఁ గొంతవడి చింతాక్రాంతుఁడై క్రమ్మఱం
జనచిత్తమున నిశ్చయించె నిటులేఁ దర్కింపఁ బెండేల క
ణ్వుని లోకమ్మున నూర్ధ్వరేతుఁడన నిండుం గాదె యట్లౌట నా
యనఘుం డీపెని నెట్లు గాంచుఁ గలదే యాకాశచిత్రంబిలన్. 24

వ. అదియునుంగాక. 25

ఉ. అంకిలిగాదు నాదు హృదయంబు తమోరహితంబు సూవె నీ
కుంకుమబొమ్మపై మరులుకొన్న విధంబుఁ దలంచి చూచినన్
శంకిలనేటికీ వెలఁది క్షత్త్రపరిగ్రహపాత్రయై తగున్
మంకుఁదనంబులేని ఘనమానసవర్తనముల్ ప్రమాణముల్. 26

వ. అని వెండియు బహుప్రకారంబులం దర్కించుచు నక్కాంచిదవలగ్న యెడ లగ్నం
బగుట నుద్విగ్నంబై నిజాయత్తంబు గాక చిత్తం బక్కన్యకాసరససల్లాపసమాకర్ణన
కుతూహలంబునం బొదలం బొదలుమాటునం బొంచి సమయంబుఁ బ్రతీక్షించుచు నవస
రంబున నత్తెఱం గెఱుంగక యత్తన్వి యుద్యానసమన్వేషణంబు సేయుచు. 27

మ. తనయప్రేమవివర్ధమానసరళద్రాక్షాలవంగాదినూ
తనశాఖిప్రతతీతతిన్ దడవి పాథస్సేకముల్ జేయఁగా
ననసూయాదులఁ బంచి మున్ను తనకై యా రాజవర్యుండు పొం
చిన యోలంబునఁ గన్నె గన్నెరుపొదం జేరెన్ యదృచ్ఛాగతిన్. 28

క. చేరువఁ జేరిన నారిం, గారవమునఁ బౌరవుండు గనుఁగొనుచుండెన్
సారసముఖి యారసికుఁడు, తారసమైయున్న సన్న దలకొనకునికిన్. 29

వ. కుసుమఫలభరానమ్రకమ్రతరతరునికరమ్ముల నలుగెలంకులం గలయం జూచుచు. 30

సీ. సరసులఁ గలఁచు నంచలమించు నడవడి కడ్డగ్గనకు దోష మలవరించుఁ
గన్నె మావులకొమల్ గముచుకోకిలముల పరువంపుఁగలరవార్భటి నడంచు
ఫలభంగములు సేయుం గలికి చిల్కలనోటి పరుసఁదనంబు వాబలిమి మాన్చు
సుమరసమెల్లను జూఱలాడెడు తేంట్ల లఁ బిత్తరపుఁ జూడ్కి నిలువరించు

తే. యానమునఁ బ్రౌఢిగాన విద్యల నిరూఢి, పలుకులసొబంగు వాలుఁగన్నుల బెడంగు
తనరఁ దనరాకవనదేవతలు భజింప, నాత్మవనవాటి మెలఁగుచు నవ్వధూటి. 31

వ. వెండియుఁ. 32

చ. జిలిబిలి చెక్కలార్చుచుఖచిక్కనముక్కునఁ బక్వదాడిమీ
ఫలయుగళంబు నొక్కనొకబాలశుకంబు రకంబుఁ జూచి వా
బలిమిన దల్చుచున్ విరులబంతి నెలంతుక దాని నేసె ను
త్తలమునఁ దప్పి దారి యది తాఁకె నృపాలుని పెన్నురంబునన్. 33

క. దూరపుఁజూడ్కులను వ్రాళు, లూరెడు నెడ విరులబంతి యురమునసోఁకన్
జారుముఖి వైచెనని గని, మారుఁ దుధృతిఁ గరఁచె నృపతి మతిఁ దామఱచెన్. 34

తే. పొంచి తానుంట యెఱుఁగక పొలఁతి వైచెఁ, దవిలె విరిబంతి చిలుకకుఁ దప్పి తన్ను
విధికృతంబైన యట్టియవ్వేడబంబు, కనికని నిజంబు దెలియఁ డమ్మనుజవిభుఁడు. 35

తే. ఆత్మవత్సర్వభూతాని యనువిధమునఁ, దామరులుకొన్నవాఁడయి తరుణి దన్ను

ాని చేరవచ్చియమ్లానసూన, కందుకంబున వై చెన కాదలంచి. 36

ను. 37

క దావపావకము పూరుషుఁడాజ్యఘటంబటన్న ప్రాఁ
జింబుగా మనుజపాలుఁడు క్రొవ్విరిచెండుసోఁకినన్
టారిగబ్బిచనుగుబ్బనురమ్మునఁ గ్రుమ్మినట్లు మి
నుం బ్రమోదకృతహారవచారుముఖారవిందుఁడై. 38

బునం గంధర్వగోచరుండై యనురూపంబు లగువిలాసచేష్టితంబులం బొరలి
లకు నక్కళవళంబుదక్కి ధైర్యం బవలంబించి భూనాథుం డక్కందుకపాతం
త్తంబుగా నమ్మత్తకాశినియన్వయనామగోత్రంబులునుం దదభిప్రాయంబునుం
వాఁడై యి ట్లనియె. 39

క ర్తనంబయిన కణ్వమహామునిదర్శనంబువాం
రా మనోరథము చేకుఱదయ్యెఁ దపస్విలేమిసం
న శ్రమంబుఁ గడ తేర్చుట కిచ్చట విశ్రమించితిన్
ూరి! యిట్లు ననుఁగందుకతాడితుఁ జేయఁబోలునే. 40

ంతిదంతములతాఁకునకోర్చిన వెన్నురంబు పూ
ల్చునీయతనుబాహుబలంబున కగ్గమైపరి
ఁడనైలి నిందుకులసంజనితుండను పౌరవుండ దు
ఁడ గుంతలక్షతమసారమణీ! రమణీశిరోమణీ! 41

యనతిథి నప, ర్యాచరణార్హుఁడ నటంచునాకస్మికమా
రపలుకుపలుకుల, కాచిలుకలకొలికియుంలుకు నలుకున్ బెలుకున్. 42

పాలుండు సాభిప్రాయంబుగాఁ బలుకుటయుం లజ్జాభయపరాధీనరతయగు
మధురగంభీరంబు లగునాకస్మికమహీపాలాలాపంబుల కులికిపడి చకితకురంగ
కరణిం గ్రేళ్లుఱుకుబేడిసమీలకరణిం బ్రేక్షణప్రభాజాలంబులు నలుగ
డలుకొనఁ గొండొక పరిభ్రమించి పయోధరమధ్యంబు వెడలు మెఱుంగుఁదీ
ంగునం బొదలమఱుంగు వెలువడి యన్నరనాథుం డాసీనుం డైయున్న
సహకారభూరుహంబుచేరువకుం జని. 43

ారఁ గన్గొనియెఁ గుంకుమబొమ్మపసిండిచాయలం
మేనివాని శశిఁ గేరెడువక్త్రమువాని వెన్నెలం
నవ్వువాని హరిఁ గేరెడుమధ్యమువాని మన్మథుం
ినవాని రవిఁ గేరెడు తేజమువాని నవ్విభున్. 44

ుజగికాయసేయుఁనంఘు)లవాని రంభోరుగుంభోరురచనవాని
న్న నెరగొన్నసొబఁగుపొక్కిలివాని దృగటోధ్యముగమధ్య మెగుచువాని

మొగరాలనఁగఁజాలు నెఱుబుజంబులవాని బింబానుబింబాధరంబువాని
నలతమ్మిచెలువమ్ముఁజిలుకుకన్నులవానిఁ దొగవిందుబెగడొందుమొగమువాని

తే. వారగలకోరమీసలహాయలువాని, నొఱపునెఱపెడు వెడలుపుటురమువానిఁ
జుక్కలను జుక్కలను నఖస్ఫురణవానిఁ, గాంచిపులకితగాత్రియైకలువకంటి. 45

వ. ఇట్లు దాటునం గదిసి యలసవలితంబులును ముహుర్ముకుళీకృతంబులును బ్రభానిర్ణిద్రంబులును బ్రేమార్ద్రంబులును భావవ్యంజకంబులును హృదయరంజకంబులును నిమేషవిముఖంబులును క్షణక్షణాభిముఖంబులును లజ్జాలోలంబులును నగువీక్షణజాలంబుల మదనసుందరుం డగునారాజపురందరుం జూచి పంచశరసమాక్రాంతంబైననిజస్వాంతంబు భయవినయలజ్జాసంభ్రమసంభ్రాంతం బగుటయు. 46

ఉ. బాలనృపాలుఁ బ్రోలనిలువన్ ధృతిసాలక మేఁజాళువా
చేలచెఱంగుజాఱ నునుఁజెక్కుచెమర్పఁగ లోచనప్రభా
జాలము క్రేళ్లువాఱఁగఁ గుచద్వితయంబు చలింపఁ జొక్కుచున్
సోలుచు సారెకున్మరలిచూచుచుఁ జేరె నికుంజగేహమున్. 47

వ. ఇట్లు పేరెలుంగునం బెదరినమదనకలహంసకామినీ కామనీయకంబున నమ్మత్తకాశిని తోరంబగు కరవీరంపుటీరం బొలమాసగొని. 48

ఉ. పూచినకప్పురంపనఁటిబోదెనుఱుంగునఁ జేరి మున్నుతా
వైచినబంతిచే నతనివక్షముగందుట కాత్మ విన్ననై
యాచెలి రాచకుంచెలువు నందనుచందము తొంగితొంగి తాఁ
జూచుఁ దలంగు వెండియును జూచుఁ దలంగు మెఱుంగుచాడ్పునన్. 49

వ. ఇవ్విధంబునం జూచుచు నాత్మగతంబున. 50

సీ. వదనశీతాంశుబింబప్రసన్నసుధావిలసనంబువహించు వీనినగవు
స్ఫురదంతరనురాగపూరస్ఫుటోద్గారగరిమంబుఁగనువీని కావిమోవి
కాయకాంచనకటస్కంధబంధురశాఖాకారూపములు వీనిఘనభుజములు
నయనపద్మపలాశనానటన్మధుకరనికరాంచితము వీనిచికిలిచూడ్కి

తే. యహాహా ! విధుకులకలశవారాకరమున, నవయువస్ఫూర్తిమన్మూర్తినవతరించి
బాలికామానహరుఁడైనపంచశరుఁడొ, కాక కేవలుఁడే యీగుణాకరుండు. 51

ఉ. ఆనగుమోము మోముగదియందులకించుఁ గదా యథాసుఖం
బానన మోవి మోవిగదియందిలకించుఁ గదా ప్రతిక్షణం
బానును మేను మేనుగదియంబులకించుఁ గదా యహర్నిశం
బీనరనాథునాథుఁ నిఁగ సేయరుణాధరనోఁచెనో మహిన్. 52

ఉ. ఈసుమకోమలాపయువుఁడీసువిధూదర్శ్యుఁడీసువర్చసుం
డీసులలాటుఁడీసుభుఁడీసుగుణాకరుఁడీసుధాధరుం

లుఁడీసుముఖుఁ డిత్తఱి నన్నువరించు నేని నేఁ
న్య మెవ్వరును జేయరువో యువతీవతంసముల్. 53

రేఁపఁగ నృప, సోమునిముఖవనరుహమునఁ జూడ్కులతోడన్
ల్గొనిమరలదు, తామరసభవుండు దలఁచుతలఁ పెట్టిదొకో? 54

మద్గురుండయినకణ్వమహామునిదర్శనార్థమై
ష్టపత్త్రితయవాసులువారలలోననొక్కఁడున్
నుటింపఁ డిట్లు నవనీరజదృగ్వ్రతమానమానపా
హార! యీతనిబెడంగుతగుందగు మేలు మాయురే! 55

ండనిసౌభాగ్యమేటిభాగ్య, మితనినుడువనినుఁ బల్కులేటిపల్కు
గానిమైచెల్వమేటిచెల్వ, మితనిమెచ్చనిసద్గుణ మేమిగుణము, 56

ం డెందముగందళింప ధృతిజవ్వాడంగ మోహంబుపై
స్ఫుటలూఁగఁ గ్రొవ్వలపుఁజూడ్కుల్ మీఱ వాంఛాలతల్
న్ నరనాథదర్శనసవానందం బమందాకృతిన్
మ్ముద్దులగుమ్మ మన్మథబలాత్కారక్షలన్మార్తియై. 57

నిముందరందఱుముదుస్సహరాగభరంబు డంబునన్
త్రస్తరిన్ దిగుచు సిగ్గున ముంగలిరిన్ బిఱిందిరిన్
రాశదల్ వశముపోవక మన్మథుఁ డానవెట్టిన
కంఠి నిల్చె నచలాకృతిఁ జిత్తరుబొమ్మకైవడిన్. 58

ండొకతడవు నివ్వెఱపాటున నెద్దియుందోఁపక నిలిచి యంతంగొంత వివే
ని యుత్తరంబునకు మాఱుపలుకక యవగణించి మరలుట కర్జంబుగాదని
హించి యాకాంతాలలామంబు సంతాపదంతురితం బగునిజస్వాంతంబు
ంబట్టి పొదలమఱుంగున నిలిచి మధురాక్షరంబుగా నిట్లనియె. 59

భాముఁ డనుచుఁ జంద్రాన్వయోత్తముఁ, డనుచు మోహనాంగుఁ డనుచు ధీరుఁ
హారుఁ డనుచు నభ్యాగతుల్ వచ్చి, మిముగణింప విందు మీతెఱంగు. 60

తరప్రతాపమున భూవలయంబున దుష్టసత్త్వసం
ము సేయుచున్ గరుణ నాశ్రమవాసులఁ బ్రోచి కణ్వసే
మీరలిందులకు వచ్చుట నామదినెంచిచూడ భా
పిచ్చుకుంటుపయిం బ్రవహించుట సూ నృపాగ్రణీ! 61

మీకవశ్య నృపసింహమ! సైరణ సేతురేని మీ
యాజ్ఞలో మెలఁగి చిత్తమురానడతున్ బ్రసన్నవీ
ముఖంబుగాఁ గదలి చయ్యన రాఁదగుఁ బర్ణశాలకున్
ఖు లేనుగూడి భవనంబున నిచ్చెద మర్ఘ్యపాద్యముల్. 62

ఉ. గాదిలిచిల్క పండుగొఱుకం దొరఁకొన్న తెఱంగెఱింగి నా
చేఁదళుకొత్తు క్రొత్తవిరిచెండున గండఱ నేయ నేయ మీ
మైఁతవులంగఁబోలు నవమంజులవంజులకుంజపంజర
చ్ఛాదితులై భవాదృశులు చానలఁ గానలలో నలంతురే. 63

ఆ. కాదుబుద్ధికృతము గానిమ్ము కఠినమ్ము, గాదువిరులబంతి మేదినీశ!
దీనికింత ద్రవ్వితిరితగవెట్లొకో, మిమ్ముఁ జేసికొన్న మెలఁతసుఖము. 64

క. ఈవైఖరినావెలఁదుక, భావాకూతంబుగాఁగఁ బలుకంబలుకన్
భూవల్లభుఁడావేళ్ల, ద్భావోల్లసదతనుతాపభరపరవశుఁడై. 65

వ. ఇత్తన్వి దైవానుగ్రహంబున నాయెడ బద్ధానురాగ యయ్యుం గానోపు లజ్జాభయంబులఁ గుఱంగట నిలువంజాలక మఱుంగునకుం జనునప్పుడు తరుకంటకనద్ధంబగుచేలంబు సడలించుకొనునెపంబున మరలి సాభిప్రాయంబుగాఁ జూచుచుం జనుటయుం క్షమాపణంబునెపంబున నాజ్ఞానువర్తినినై చరియింపంగలదాన నని యభిప్రాయసూచనం బాచరించుటయుఁ గలిగియున్నయది యట్లగుట నారదవాక్యంబు సమకూడెంగాకేమి మదభిప్రాయసూచనంబున నిక్కలికిం గరఁగించి మనోరథంబు సఫలంబుగా నెలకొనందగునని యమ్మహీకాంతుండు సాంత్వనస్వరంబున నయ్యింతితో నిట్లనియె. 66

క. ఇవ్వాలనవ్వాలఁబువ్వుల, క్రొవ్వాలపులఁ బొదలిపొదలి కొననేటికి నీ
వెవ్వనిజవ్వనివివ్వని, దవ్వనివెఱచఱవ మెలఁగెదవు మేలు బళీ! 67

క. వాలాయంబుగనీయెడ, నాలోలం బయ్యె హృదయ మలికులవేణీ!
హేలారతులం గౌఁగిట, నేలెదవో కాక మరునకెర సేసెదవో. 68

సీ. జలజాక్షి నీతనుశ్రమవారిపూరమ్ము పాద్యోదకమ్ముగాఁ బరిణమింతు
భద్రేభగమన! నీప్రమదాశ్రుకణజాల మర్ఘ్యతోయమ్ముగా నవధరింతుఁ
గలికి! నీకడగంటిగరువంపులేఁజూడ్కు లలరులసోనగా నందగింతు
నతివ! నీయధరాధరామృతాస్వాదంబు సరసంపువిందుగా సమ్మతింతు
గీ. బంధరచనాచమత్కారభరితసురత, మానితాయాసనిశ్శ్వాససమారుతమ్ము
హితజలార్ద్రానిలమ్ము కానిచ్చగింతుఁ, గనికరమ్మునబంగారు గనికరమ్ము. 69

సీ. పరుషవల్కలచీరపరిధాన మెట్లోర్చె? నీమేను నవనీతకోమలంబు
మృగలూనకుశశిఖామిళన మెట్లు సహించె? నీయంఘ్రులభినవనీరజములు
బాలపాదపసేకపాత్ర మెట్లు వహించె? నీకేలు పల్లవశ్రీకరంబు
ప్రసవరేణుకరాళపవన మెట్లుభరించె? నీమోము దర్పణనిర్మలంబు
గీ. శీతలజలావగాహమస్నేహతువర, కందమూలఫలాశాదికదశనంబు
నేయుంటకునెట్లు దనరె? శచీవిలాస, మెన్నదొరఁకొన్న నీచిన్నె యివురుబోఁడి!. 70

మ. చతురంభోనిధిమధ్యభూవలయపూజ్యప్రాజ్యసామ్రాజ్యశా
శ్వతదివ్యావ్యయనవ్యభవ్యముల నశ్రాంతంబువిశ్రాంతుఁడన్
బలిమిఁగా నన్ను వరించి యంచితమహాభాగ్యమ్ముఁ గైకొమ్ము ర
మ్మతివా! నామతివాంఛఁ దీర్తువదిమేలాలంచి లాలించవే. 71

తే. అనినరాగంబుసిగ్గు మోహాతిరేక, మాభిజాత్యంబు సమ్మోదమతిశయిల్లఁ
బొదలమాటునవెఱనీటుపొదలమాటి, మాటికినిదొంగిచూచుచు మగువ పలికె. 72

మ. గురుపత్నీరతుఁడాసుధాకరుఁడు మీకూటస్థుఁడౌ నా బళీ!
సరసాగణ్యులుమీరు మీకిదికులాచారంబు పారంపరీ
పరిపాటిన్ బలుకన్ విడంబనముగా భావించితిన్ మేలుమే
ల్గురుకన్యాపరిరంభణంబునకు సంకోచంబు మీకెట్లగున్? 73

తే. నట్టడవిలోననన్నిట్టునట్టువలచి, గొట్టుమిట్టాడనేటికిఁ బట్టభద్ర!
పుట్టునకుమున్న లేమకుబొట్టుగట్టి, చెట్టపట్టుటకొకరుండు పుట్టెఁ జూవె. 74

శా. నాకున్నజ్జనకుండెఱుంగనివిధానంబెట్టుగావింపనో?
లోకుల్ మెచ్చరు మిమ్ముమానితనయాలోలాత్ముఁడండంచు సు
శ్లోకుండైనగుతాతకశ్యపుఁడువచ్చున్ మెచ్చునిచ్చున్ ననున్
మీకున్నాకుసరోరుహాసనుఁడు బల్మింగూర్చిన ట్లైనచోన్. 75

తే. అకట! గుడమిశ్రమగుపాయసాన్నమేని, నుడుకుజాతినరుచ్యమైయుండుటెట్లు?
తారతమ్యంబుభావించి తరతమంపు, మేలుఁ గైకొమ్ము కరుణనన్నేలుకొమ్ము. 76

వ. ఇవ్విధంబున. 77

తే. అధిపుఁడాలించియాలించి యభినుతింప, రమణి మందాక్షమందాక్షరంబుగాఁగ
మొలకపలుకులనమృతంబుఁజిలికిచిలికి, చకితచకితాంగయష్టియై సంభ్రమించి. 78

క. ఉత్తరముం బ్రత్యుత్తర, ముత్తమముగ నిటుల నడపి యంత్తరమాపై
నెత్తక చెలిమరలెఁదదా, యత్తఁజిత్తమున మెత్తనగుచున్ నగుచున్. 79

వ. అయ్యవసరంబున. 80

మ. కలకంఠీ! వరవర్ణినీ! మదవతీ! గంధేభకుంభస్తనీ!
జలజాక్షీ! మృదుభాషిణీ! శశిముఖీ! శాతోదరీ! సుందరీ!
యలివేణీ! రమణీమణీ! కలికి! తన్వంగీ! మనోహారిణీ!
లలనా! యెచ్చటనొంటినుంటివనిగోలంజేరరాశీజనుల్. 81

వ. తదనంతరంబ. 82

ఉ. కించిదుపజ్ఞ నాత్మఁ బరికించి తదాననచిహ్నముల్ విలో
కించి తదీక్షణంబు పరికించి తదంతరుదంతముస్విత

ర్కించి తదంగయష్టిపులకించిరహించుటఁ జూచిచూచి శం
కించి భయంబుగూరఁ దిలకించి ప్రియంవద లేమకిట్లనున్. 83

ఉ. తోరములైనపూఁబొదలఁదూఱఁగనీసకలాంగకమ్ములె
ట్లోరిచెనమ్మ! భృంగములయుద్ధతి నీవదనారవిందమే
తీరునవైఁచెనమ్మ! విరిదేనెలసోనలరొంపులెల్ల నీ
వేరహి దాఁటితమ్మ! యిటులేకతమేకతమే తలోదరీ! 84

ఉ. నవ్వులు గావు నీదువదనంబునవిన్నఁదనమ్ము హేతుకం
బెవ్విధి సంభవించె? నిటులెవ్వరు నీకహితమ్ము చేసి? రే
యొవ్వమిలేదు నావలననొక్కయెడన్ మము బుజ్జగించి నీ
వివ్వనవీథి నివ్వటిల నేమికతంబు? నితంబినీమణీ! 85

వ. అనిన నక్కన్యారత్నంబు కొండొకభావించి కించిదంచితలజ్జాసజ్జితహృజ్జలజంబుగాఁ
బ్రియంవదతో నిట్లనియె. 86

ఆ. మేలుదెలిసికొంటివాళీశిరోమణి!, వింతలేనియూపులింతగలదె
చెలియ తెలియవినుము చిత్తదౌర్బల్యంబు, దీఱఁగలతెఱంగుఁ దేటపఱుతు. 87

మ. లలనా! భూలలనావరుండొకఁడు కేళాకూళికాచూళికా
కలనాపుష్కలపుష్కరప్రకరచంగద్భృంగచంగాంగనా
కలనాదామృతవీచికావలనజాగ్రచ్చిత్తచక్రాంగుఁడై
యలనాళీకశరుండునుంబలెఁ బ్రమోదాపాదియయ్యెన్ రహిన్. 88

క. పేరన దుష్యంతుండఁట, కైరవబాంధవకులాగ్రగణ్యుండఁట క
ణ్వారాధనకుతుకమున నిం, డారఁగ వచ్చెనఁట యేతదాశ్రమమునకున్. 89

తే. అతనియెడనొక్కయపరాధమాచరించి, చింతిలుచునున్నదాననో చిగురుఁబోఁడి!
చేతివిరిబంతిచూచాయఁ జిలుకనేయఁ, దప్పియారాజువక్షంబు దాఁకెనదియుఁ. 90

వ. అనినం బ్రియంవద భయంబొదవ నమ్మదవతిం జూచి. 91

మ. లలనా! మవ్వపుజవ్వనంబుతఱిబాలత్వంబుతత్త్వంబుగా
నిలుపం దాదృశుఁడీదృశక్రమముదానిం దానిగర్హించినం
బలుగాకుల్ బలుగాకుసేయుందురు సెప్పం జెప్ప నిట్టొప్పముల్
దలపంబోలునె? రాజరాజతఁడు మేలమ్మేలె? హేలావతీ! 92

తే. తాతకశ్యపుఁడరుగుచుఁదరుణినీకు, నేమువినునంత దుష్యంతుఁడిటకువచ్చు
నర్ఘ్యమిమ్మనిబోధింపనతనిపెంపు, తెలియదఁటె? తల్లి! హేలావతీమతల్లి! 93

చ. అనుచు శకుంతలన్ మిగులనాడి ప్రియంవద రాజుపాలికిన్
జని తగనర్ఘ్యపాద్యముల సత్క్రియలం బ్రియమాచరించి యిం

ట్లనియె వసుంధరాధరశశాంక! విశంకటవృత్తి నిత్తఱిన్
గనుఁగొనఁగంటిమాశ్రమనికాయశుభాయకునిన్నుఁగన్నులన్. 94

తే. పాలవంటికులంబునఁ బరఁగుసోముఁ, డమ్మహామహుసంప్రదాయమునఁ గీర్తి
కెనకమెసఁగెడునాదిగర్భేశ్వరుండ, వతిథివైతివి పావనమయ్యె వనము. 95

వ. అని బహుప్రకారంబుల నభినందించి మఱియు ని ట్లనియె. 96

ఉ. ఇంతి యదల్పఁగా బెదర కిట్టటు గ్రుమ్మరు చిల్కమీఁదఁ బూ
బంతితటాన వైవ గుఱి వాసి యయారె! దయారసార్ద్రి! దు
ష్యంతమహీప! నిం దవిలె శాంతి మెయిం గరుణింపుమయ్య! య
శ్రాంతమహాపరాధనులు సైఁప భవాదృశు లర్హు లిమ్మహిన్. 97

వ. అని యివ్విధంబున క్షమాపణంబు లగువాక్యంబులం దన్నుఁ బ్రార్థించునక్కన్యాసహచరిం జూచి యజ్ఞానకృతం బగునిక్కార్యం బనార్యంబని కోపింప నుత వెడంగులమె యది యట్లుండని మ్మిక్కాశ్యపులూర్ధ్వరేతులగుట జగత్ప్రసిద్ధంబైయుండ నివ్వనంబున నీజవ్వని నివ్వటిలం బనియేమి? యిక్కామినివృత్తాంతంబంతయు వినవలతుం జెప్పుమనిన నమ్మహారాజుతోఁ బ్రియంవద యి ట్లనియె. 98

సీ. అలగాధిసుతుఁడాగ్రహాగ్రహావిష్టుఁడై యావసిష్ఠులగెల్వ నలవిగాక
సరవిబాహుజబాహుజవముఁగర్హించుచు బ్రహ్మర్షిభావంబుఁబడయఁ గోరి
హిమవదుత్తరతటాశ్రమసీమ నివసించి దృఢతరనిష్ఠాగరిష్ఠుఁడగుచుఁ
దపమాచరింపఁ దద్దారుణానలశిఖల్ కడుకొని నభమెల్లఁ గలయఁబ్రాఁక
గీ. దివిజసంఘంబు భయమున దేవవిభుని, మఱువుసొచ్చిన నమ్మహామహుఁ డపుడు దాని
విఘ్నమునకును పాయంబు వెదకి మేన, కాహ్వయముఁ దాల్చునచ్చరనామతించి. 99

శా. విశ్వామిత్రతపఃప్రభావకలనావిర్భూతఘోరాగ్నిచే
విశ్వంబెల్లఁ దలంకుచున్నయది నీవిన్నాణముం జూపుచున్
విశ్వాసంబొలయించి యమ్మునితపోవిఘ్నంబు గావింపుమీ
శశ్వత్కీర్తివహింతు వీవుధరనాచంద్రార్కముం గోమలీ. 100

చ. అనవిని మేన విన్నదయి యారసి యారసికావతంసుతోఁ
గనుకనిఁ బల్కె గోపనుఁడు గాధిజుఁ డాధిజనింపఁజేసెడిన్
గనివిని మీరుపంపఁ జనఁగాపలెఁ గావలె సత్సహాయముం
బనుపనగున్ సమీరణకుమారుని మారుని నమ్మధున్ విధున్. 101

వ. అనినఁ బ్రీతుండై పురుహూతుం డి ట్లనియె. 102

క. కంతుం బంతున్ రజనీ, కాంతుం బంతుం బ్రమోదకరు గంధవతీ
కాంతుం బంతున్ మ్రోల వ, సంతుం బంతున్ లతాంగి! చనుమని పనిచెన్. 103

తే. అట్లు లాలించి పనుప నయ్యలరుఁబోఁడి, యొడలితఱుఁగున మురిపంపునడబెళుకున

గ్రొమ్మెఱుఁగులీల రాయంచకొదమభాతి, వెడలెఁ దెఱుఁగంటివేలుపుఁ గడిఁదిప్రోలు. 104

వ. అట్లు వెలువడి శీఘ్రగమనంబున. 105

సీ. సురసరిత్పరిసరస్ఫురదురస్సరపుర స్సరదురుత్తరమరుత్తరువరంబు
దినదినస్తనితనిస్వనకనన్మునిమనగ వనితనూతనఘనాఘనఘనంబు
కలభలిట్కులచలచ్ఛలదలక్షలదల ద్దలమిలజ్ఝలజలజ్ఝలజలంబు
ప్రవణవజ్జవనవత్ప్లవనవన్నవనవ శ్రవణవత్స్వపనవిప్లవపదంబు
తే. గజగవయగండభేరుండఖడ్గచమర, శరభశార్దూలశంబరశల్యవృకవ
రాహసింహవలీముఖప్రముఖదుష్ట, సత్వముఖరంబుఁ గనియెఁ దుషారనగము. 106

వ. కాంచి విస్మయావేశంబునం దదుత్తరతటంబునం బ్రవేశించి. 107

క. అందుంగల కందువలకుఁ, గందళితంబగుచు హృదయకమలం బలరన్
సుందరి మునిమందిరమగు, చుందిరమగు నాశ్రమంబు జొరఁ జొర నెదుటన్. 108

సీ. తపము పెంపునఁ దోఁచు దహనకీలములతో జటిలంబులగుపల్లజడలవానిఁ
భసితాంగరాగసంపదలసొంపదలింపఁ దగువలీవలితగాత్రంబువాని
పైఁ బుట్టుపుట్టకోమలచీమ లెగఁబ్రాకి మార్పనేర్పడనిలోమములవాని
వ్యాఘ్రాజినోత్తరీయము మేనిచాయగా బలు మొగంబునఁ దొట్రుపఱచువానిఁ
తే. కందమూలాదికాశనకాయశోష, ణోద్యదష్టాంగసంగతయోగభాగ
పావనబ్రహ్మఋషిభావభావనాప్ర, తీతదీక్షావిధేయుం గాధేయుఁ గాంచె. 109

వ. ఇత్తెఱంగున నతిఘోరతపశ్చరణపరిణతదీక్షాలక్షితచరిత్రుం డగువిశ్వామిత్రుఁ గాంచి తత్తేజోవిశేషంబునకు సాధ్వసంబు రెట్టింప నన్నిలింపగణికాలలామంబు. 110

క. కనుఁగొను గనుకొని మునుకొను, మునుకొని మునుకొనక వెనుక ముందై యుందున్
మునుతనుపనిచినపనికిం, గొనకొనుఁ గొనకొనదు తపసి కోపనుఁ డనుచున్. 111

వ. వెండియుఁ. 112

ఉ. భూరితపఃప్రభావమున భూవలయంబు నభంబుఁ గ్రాఁచుచున్
జేరను జెందనుం బ్రణతిసేయను శక్యముగానివాని నే
నే రహి మారుబారికెలయింపుదు నట్లని ప్రోలుక్రమ్మరం
జేరిన వాసవుం డలుగుఁ జింతితకార్యవిపర్యయంబుగాన్. 113

తే. అమరనాథుండు లోకహితార్థమనుప, శక్తియుక్తులనదిపూని సంఘటింపఁ
బిదపనెన్నైనఁ బేరును బెంపుగలుగు, దవ్వుదవ్వుల వెఱఁపూనితలగుటెట్లు. 114

తే. అనుచుభావించి భావించి యలరుఁబోణి, గాఢనిశ్చయమున మనఃకమల మలరఁ
కెలుఁకులఁ దానువిలాసవిచేష్టితముల, గాధిజునిమ్రోలఁ గ్రీడించెఁ గలితనమున. 115

సీ. నృత్యన్మయూరికానికురుంబమునఁ జేరి నగుచు నృత్యముసేయుం నళినగంధ
ధావన్మరాళికాతల్లజంబులఁ జేరి గతులవైఖరిఁ జూపుఁ గలువకంటి

ప్రతిపదశారికాపరికరమ్మునఁ జేరి మధురమ్ముగాఁ బల్కు మంజువాణి
కూజద్ద్విరేఫికాకులకమ్ముజతఁ గూడి శ్రుతివిభాగ మొనర్చు సుందరాంగి
తే. సవిధమధుమాసవాసరోత్సవవిశేష, లసదలంకారముకుళపలాశకుసుమ
ఫలభరానమ్రపాదపపటలజటిల, గాధిజాశ్రమసీమశృంగారగతుల. 116

వ. ఇవ్విధంబునఁ గొండొక పరిభ్రమించి. 117

మ. నెలఁతల్ దాను సురాపగాజలములన్ నీరాడికై సేసిత
త్పులినస్థానమునందుఁ గ్రొవ్వలపుగాడ్పుంగూన పైవీవఁగా
లలిఁ గూర్చుండి విపంచికారణనముల్ రాజిల్ల నయ్యప్సరః
కలకంఠీతిలకంబు సేయఁదొణఁగెన్ గానం బనూనంబుగన్. 118

క. వీనులవిందై నెలకొను, గానామృతమానె మానెఁ గౌశికుఁడు నిజ
స్నానంబున్ మానంబున్, ధ్యానంబున్ మొదలుకొనువిధానం బెల్లన్. 119

వ. ఇట్లాలించి యాత్మగతంబున. 120

క. కాదలికులఝుంకారము, కాదలకోకిలరుతంబు కమనీయసుధా
సోదరమిన్నాదరసం, బాదరణీయముయదీయ మనికను దెఱచెన్. 121

వ. ఇట్లమ్మునికులాగ్రేసరుండు నిమీలితలోచనుండై నలుగడలంజూచునవసరంబున. 122

ఉ. సోమునిలేమభాతిఁ బరిశుద్ధసువర్ణశలాకచాడ్పునన్
గోమలకల్పవల్లివలె గుమ్మనుకుంకుమబొమ్మకైవడిన్
గామునిహేతిరీతిఁ దొలుకారుమెఱుంగుతెఱంగునన్ లతాం
గీమణిదోఁచెఁ గట్టెదుటఁ గేవలమున్ వనదేవతాకృతిన్. 123

ఉ. ఆసమయంబునన్ మదనుఁ డగ్గలికం గళికాముఖంబులై
భాసిలుతూపులన్ హృదయపద్మము లక్ష్యము సేసి యేసినన్
గాసిలి కౌశికుండు తమకంబునఁ దన్ గనుసన్న చేసి యుం
ల్లాసము వెల్లివీఁగ సఖులన్ నిలువన్ నియమించి గ్రక్కునన్. 124

మ. పలుకుల్ దేనియ లూరఁ గౌనునునియం బాలిండ్లుపొంగారఁ బొం
దళుకుం బయ్యెద జాఱ వేణిపొరలన్ దాటంకరత్నద్యుతుల్
తులుకుం జెక్కులఁ జేరఁ గన్నులబెడంగుల్ మీఱ నయ్యప్సరో
లలనారత్నము వచ్చి గాధిజునిమ్రోలన్నిల్చె నమ్రాంగియై. 125

ఉ. అంచితభక్తియుక్తి వినయమ్మెనయన్నునుఁ గేలుదోయి జో
డించి నమస్కరించి నెఱతీవ దలిర్పఁగ మ్రోలనిల్చినన్
గాంచి మహామహుండయినగాధితనూజుఁడు కూర్మి పేర్మి దీ
వించి లతాంగి! నీ వెవతెవే ధృతి పేకలఁగెన్ నినుంగనన్. 126

వ. అని సాభిప్రాయంబుగా నడుగుటయుం సమ్మదమ్మున కమ్మదవతి యమ్మునితో నిట్లనియె.

క. మేనకయని పిలుతురు నను, మానినులాగ్రణి! తిలోత్తమాహేమాదుల్
నానెచ్చెలు లేమచ్చర, చానల మెంచేసి వేడ్క సలుపుదుము రహిన్. 128

క. ఎక్కడిమీ రెక్కడినే, మెక్కడిరతి పరమమునుల కివియుం గలవే ?
ముక్కిడి దీపించుటకై, యెక్కటిరా నిట్టుపలుక నెల్లిదమైతిన్ 129

క. సామాన్యలఁ గా మమ్ముం, గామింపకుఁడేము నూఱుక్రతువులవానిం
గామోపభోగములకుం, గామింతుము సూ నిజంబుఁ గనుగొనుమనఘా! 130

క. పావనభవదంఘ్రిద్వయ, సేవనము విమలకమల శిశిరనభస్వ
త్సేవనముఁ దొరఁకొనునిట, నీవనమున మెలఁగువార మీరలుగకుఁడీ. 131

తే. అనుచుఁ బ్రతికూలవాక్యంబు లతివపలుకఁ, జిలుకబాబావజీరుండును చిలుకుములుకు
టలరుటంపఱతోఁకునసలసిసొలసి, ధీరవర్తన మెడలి ప్రార్థింపఁదొడఁగె. 132

సీ. తఱిపివెన్నెలవేఁడి తలఁకించెఁ గటకట! నీ యధరాధరామృతం బానసిమ్ము
వలపుఁ దెమ్మెరకూన వడఁకించె మగువ! నీ కలుకుపైఁట చెఱంగుఁ గప్పనిమ్ము
విరికటారపుజోదు వెఱపించె వెలఁది నీ కుచదుర్గములహత్తుకొనఁగనిమ్ము
పికశుకనికరమ్ము బెదరించె నతివ! నీ సాహాయ్యమునఁ గేలి సలుపనిమ్ము
గీ. జలదళఫలానిలాహారసదుపవాస, చిరతరప్రతదీక్షావిశేషశుష్క
దవయవాయాసమున భావ మలసమయ్యె, బాలనీమ్రోలశుశ్రూషఁ బడయనిమ్ము. 133

వ. అని యనేకప్రకారంబుల. 134

శా. ఈబాడంగరఁగించుచున్ గృపణుఁడై హేలావతిన్ వేఁడుచున్
జేఁజేతం దెమలింపఁ జాఁచిహాసితస్మేరాననాబ్జంబుతోఁ
గూజన్నూపురఘంటికావళులతో ఘుమ్మన్నరాళీగతిన్
రాజీవాననయిట్టటుం బెనఁగెదూరం బైసబీరంబునన్. 135

క. మెలఁగున్ దలఁగున్ భయమునఁ, గలఁగున్ మలఁగున్ లతాంగి కపటారభటిన్
జెలఁగున్ వలగొనునెనరున, నలఁగున్ దొలఁగున్ నగు న్వయారముమీఱన్. 136

వ. ఇట్లమ్మునిగృహీతం బగునిజకరాబ్జాతంబు సడలించికొని శరీరంబులయారంబులను, దమాలంబులరోలంబులను, లవలీకుంజంబుల పుంజంబులను, ద్రాక్షాకాయమానమ్ముల వితానమ్ములను, దిలకమ్ములకులకమ్ములనుఁ గాసారంబులతీరంబులను, గిరితటంబుల నికటంబులను బరిభ్రమించునక్కపంబునఁ జేఁజిక్కక చిక్కులఁబెట్ట నెట్టన గాధిపట్టి యిట్టట్టుఁజుట్టివచ్చి చెట్టఁబట్టి పట్టువఱచుచు నిట్టులనియె. 137

కవిరాజవిరాజితవృత్తము.—
కలఁకలు సేయకువే కలికీ నుడిఁ గైకొనవే మరుపూములికీ
కొలఁకులఁ గ్రుంకకువే యబలా మదిఁ గొంకకువే భృతకామబలా

కెలఁకులఁ డాఁగకువే లలనా! వెదకింపకువే కనుఁగోఁగలనా
సిలుగులఁ బెట్టకువే రమణీ! ననుఁ జేకొనవే గుణహీరమణీ! 138

తే. అనుచుఁ బ్రార్థించి దోహ్హదం బవధిగాఁగఁ
కూడియుండుట కోడఁబడి కుసుమగంధి
సంయమీంద్రునితో వచ్చె సహచరీసు
కల్పితంబైన కిసలయతల్పమునకు. 139

వ. ఇట్లయ్యప్సరోలలనామణిహస్తంబు నిజహస్తంబునం గీలించి యనల్పకల్పితానల్పంబగుకిసలయతల్పంబుఁ బ్రవేశించి తపఃప్రభావంబునం దదనురూపం బగురూపంబు గైకొని మన్మథరాజ్యపట్టాభిషిక్తుండై విశ్వామిత్రుండు. 140

సీ. వలుఁగుపైఁటచెఱంగుఁ దొలఁగించి తొలఁగించి యుదుటుగుబ్బలగోరులూనియూని
బిగువుఁగౌఁగిటిలోనఁ బొగయించి పొగయించి సవురుగా మైఁదీవ నివిరి నివిరి
కడిసి మోమున మోముఁ గదియించి కదియించి యలమి వాతెఱ తేనె లాని యాని
కేళిమైఁ దమకంబుఁ గెరలించి కెరలించి కళలూర మరుకేళిఁ గలసి కలసి
గీ. సొలసి సొలసియుఁ గ్రమ్మఱ ననఁగి పెనఁగి, యొడలబడలిక వాయ నయ్యువిదసేయు
నంగసంవాహనంబున కలరియలరి, కడపె నారాత్రి సుఖితుఁడై కౌశికుండు. 141

వ. ఇవ్విధంబున. 142

క. సురతరుపరికరధరణీ, ధరవరశిఖరస్ఫురల్లతాభవనమునన్
జిరతరరతరాగంబున, సురతరుణిం గూడి మౌని సుఖమున నుండెన్. 143

తే. అంతఁ జలచలపిదపిదమనుచునవిచి
కలలమైవిప్పువాఱుచుఁ గరుడుగట్టి
తలదలిర్పఁగ గర్భమై తరతరంబ
నెలమసలెఁ జీరచిక్కెనన్నెలఁత కధిప! 144

వ. ఇట్లు గర్భంబు నవమాసపూరితం బగుటయుం. 145

క. రాజర్షివలననిర్జర, రాజవధూతిలకమునకు రమణీయంబై
రాజిలులగ్నంబుననీ, రాజానన గలిగె ఖచరరాజి నుతింపన్. 146

వ. ఆమ్మెయి నమ్ముని నెమ్మనంబునం బమ్మినసమ్మదమ్మున నక్కూఁతునకు జాతకర్మాదిసంస్కారంబులు నిర్వర్తించినం గాంచి యమ్మత్తకాశిని మెత్తమెత్తన నత్తపోధనుచిత్తం బారాధించి ప్రథమాధిగమంబునం జేసికొన్నసంకేతంబుఁ జెల్లించితి నింక యథాకామంబుగా వర్తింపంగలదాన నట్లగుట నాశ్రితరక్షావిచక్షణంబు లగుకటాక్షవీక్షణంబుల నన్నుం గృతార్థం గావించి వీడుకొలుపం దగునని సప్రణయంబుగాఁ దచ్చరణంబుల కెరఁగి పొత్తికల నత్తమిల్లినయయ్యుత్తానశాయినిం దనపాదిఁగిట నిడుకొని సవినయంబుగా సన్నిధి నిలిచియున్నమరున్నటీతిలకంబుదెసం జేఁజేచూచి యట్లకాక

వ. ఇట్లు విశ్వామిత్రతపఃప్రభావంబునం గ్రవ్యాదగోచరంబుగాక శకుంతరక్షితయై నవనళినపలాశతల్పంబునం బొరలుచున్నయక్కన్యకాలలామం దనపొదిఁగిటఁ బొదివికొనివచ్చి పర్ణశాలం గుశాస్తరణంబునం బదిలంబుగ నిడి యథాశక్తిం బెనుచుచున్నం దెలిసి యదితియుం గశ్యపప్రజాపతియు నన్ననసూయనుం దక్కటి పరిచారికాజనంబునుం బనిచిన నేమునుం గులపతింగాంచి తదనుమతిని కాంచనగాత్రిం బెనుచుచున్నవార మిదియిక్కొటికి జన్మప్రకారంబు. 157

చ. ఆనవిని భూవిభుండు దరహాసవికాసవిలాసభాసురా
ననవనజంబుగాఁ బలికె నాతి ప్రియంవదవే నిజంబుగన్
జనవుననింపునింపుచునుసారెకుసారెకు ధీరధోరణిం
బనిగొనిపల్కుపల్కుల సభాజనభాజనమయ్యెడెందమున్. 158

తే. అనుచుమునికన్యకావృత్తమతిప తెలుప, వినుచునానందరసమునవిభుఁడు మెచ్చ
నట్టియెడఁ గర్ణతాడితంబయ్యె బహుళ, హళహళంబగువాహినీకలకలంబు. 159

వ. అయ్యవసరంబున. 160

ఉ. సైనికసింహనాదములుసామజబృంహితముల్ తురంగ హే
షానినదంబవక్రరథచక్రపరిక్వణనంబు ఘోరమై
వీనులఁగ్రమ్ముదేరఁ జెలివేమరలెన్ మరలెన్ సఖీజనం
బానరనాథుఁడున్ మరలెనాత్మచమూవినివేశనార్థియై. 161

వ. ఇత్తెఱంగున నాశ్రమంబువెలువడి నిజసైనికులకుం బొడసూపి తదాశ్రమంబునకు సమ్మర్దంబుగాకుండునట్లుగా నిజస్కంధావారంబు రచియింపం బనిచి తన్మధ్యంబునం బటకుటీరం బెత్తించి విచిత్రాస్తరణశోభితంబును బ్రలంబమణిమాలికాలంకృతంబును గృష్ణాగరుధూపధూపితంబునునై మనోహరంబగునప్పటమండపంబునం గిసలయతల్పంబునం బవ్వళించి యమ్మునికన్యకాసమాగమోపాయంబుదొరకొనక మనోజవేదనాదోదూయమానమానసుండై కొండొకవినోదంబులం బ్రొద్దుగడపుచుండె నంతనక్కడ. 162

క. ఆనరనాథునిచెలువము, మానసమునఁబొందుకొనఁగ మానిని సఖులుం
దాసైయుద్యానంబున, సూనాపచయంబుసేయుచున్ విహరించెన్. 163

వ. అయ్యవసరంబున. 164

ఉ. తమ్ములతావితానములఁదావలమైపలమైనగాలితో
యమ్ములకామతింపఁజటులాలసలై వనకేళిసేయఁగాఁ
దమ్ములతావితానములఁదావలమైవలమైనగాలితో
యమ్ములకామతెంపఁజటులాలసలై వనకేళిసేయఁగన్. 165

యనుచు నొడంబడి తత్కరతలంబుల మణిశలాకికాకారంబునం బొదలుతనయం
దనయంకతలంబునకుం దిగిచికొని బాష్పాకులలోచనుం డగుచు మూర్ధఘ్రాణంబుఁ
జేసి ముంగేల చిబుకంబు నిమురుచు మేనకం గాంచి యిక్కన్యచంద్రాన్వయప్రదీపకు
నకు నగ్రమహిషియై చక్రవర్తిలక్షణలక్షితుం డగుకుమారుం బడసి చతురుదధివేలా
వలయితసామ్రాజ్యసౌఖ్యం బనుభవించుచు నుభయకులంబులకుం గీర్తిపౌరుషంబులు
సంపాదింపంగలయది యట్లగుట బహుప్రయత్నంబున దీని సురక్షితం గావించునది
యని క్రమ్మఱ నిబ్బాలిక నమ్మేనకకు నొప్పంజెప్పి గాఢాలింగనాదిసత్కారంబుల
నుపలాలనం బాచరించి యయ్యచ్చరవాల్గంటిం బ్రియంబున వీడుకొల్పి తానును
యథాపూర్వంబుగాఁ దపోనిష్ఠాగరిష్ఠుండై యుండె మేనకయుఁ బ్రియపుత్త్రిం గైకొని
యేతదాశ్రమసమీపంబుఁ బ్రవేశించి. 147

చ. పానుపగుమాలినీసలిలపూరము చేరువఁ జారుసైకత
స్థలముపయిన్ సుజాతజలజాతమృదుచ్ఛదశయ్య నాత్మలో
నలుకక యూఁతుడించి రహి నచ్చర మిన్నులు ప్రాఁకె 'భోగినీ
లలనల కేలపిల్లతపులం' బనుసామెత నిక్కువంబుగాన్. 148

ఉ. ఆదట తాతకశ్యపుఁ డహర్ముఖమున్ గని మాలినీనదిం
బ్రోదిజలంబులాడుటకుఁ బోవఁగ నొక్కెడ నొక్కబాలికా
రోదనము న్వినంబడిన రోయుచుఁ దామరపాకుపాత్రికం
బోదన లేక యట్లొరలు పాపమిటారినిఁ జూచి యార్తుఁడై. 149

క. ఎవ్వనిబాలారత్నం?, బెవ్వఁడు జనకుండు? జనని యెవ్వతె? జననం
బెవ్వలన? దీనిఁ గొనసే, నెవ్వఁడ? నెట్లనుచుఁ బ్రోయ నెట్లగు నడవిన్? 150

తే. అనుచు సందేహడోలాయితాంతరంగుఁ
డగుచుఁ దనయోగదృష్టి నయ్యాఁటనిసువు
పుట్టినతెఱంగుఁ గనుఁగొని ప్రోదిఁ బెనుచు
వాంఛ నూహింప నశరీరవాణి పలికె. 151

క. మేనకకు గాధిజునకున్, మానుగ నుదయించె దీని మనుపందగుఁ ద
త్సూనుఁడు నీదౌహిత్రుం, [illegible]నుభయ యత్రోతజనకుఁ దను నుడి వినవే. 152

వ. అని మఱియును. 153

క. కుంతలముఖరాజవధూ, కుంతలకాశ్మీరదానగుణచణబాహా
కుంతలఘనయశరీర శ, కుంతల యసి దీనిఁ బేరుకొనియె మునివినన్. 154

వ. తదనంతరంబ. 155

తే. పుట్టు బ్రహ్మచారి పుత్త్రమిత్త్రకళత్ర, యోగభోగరహితుఁ డూర్ధ్వరేతుఁ
డహహా! దైవఘటన మాపిన్న పాపమే, నలమికొనుచు ముద్దులాడఁ దొడఁగె. 156

ఉ. గమ్మనుతమ్మినెమ్మొగముకల్వలు కన్నులుకప్పువిప్పులం
బమ్మిననాఁచుకొప్పునెడఁబాయని జక్కవగుబ్బచన్నులుం
గమ్మనితేనెమోవిబిసకాండభుజమ్ములు నొప్పమీఱఁగాఁ
దమ్మునపోలియొప్పనొకతమ్మికొలంకువుగాంచియచ్చటన్. 166

తే. కొమ్మలందఱురతనంపుసొమ్ములూడ్చి, సూనరజములుసోఁకినసొలపుమేను
లమరగంటలుదీసిదుమ్మాడినట్టి, మరునిమదమేనుఁగులరీతిసరసిఁజొరఁగ. 167

చ. అడుగులనంటియూరువులనానినితంబములందినాభినిం
బుడికి వళుల్ స్పృశించికుచముల్ పడిముట్టిసరోవతంసమ
ప్పుడఁతులఁగూర్మి కానివలెబంధురకంకణకర్ణికావళిం
దడవుచునిల్పికైకొనియెఁదన్మయతం బ్రతిబంధవైఖరిన్. 168

సీ. ఒకలేమవలిగుబ్బనొగిమృణాళముఁజుట్టి తారుణ్యకలశాబ్ధిఁదరుచునొకతె
యొకచానకనుబెళుకులాలయగనూర్ములుగట్టి హొయలుగాఁజేయూఁతలూనునొకతె
యొకతన్విమృదుహస్తముఁదియప్పులఁదొట్టి పద్మానుభావమేర్పఱచునొకతె
యొకచామలసదూరు వుదపూరమునమెట్టి మకరేభకలహంబుమనుచునొకతె
గీ. యొకలతాంగినిజేయూఁత నోటుపఱిచి, పీనులంటిజయశ్రీలఁ బూనునొకతె
సఖులుదానుశకుంతల జతలజతల, నతులగతులజలక్రీడలాడునపుడు. 169

క. వేడుకమీఱఁగజలకము, లాడిసరోవరమువెడలి యన్యోన్యంబున్
దోడయికైసేసిజల, క్రీడాలసలగుచునలవరించిరి తొడవుల్. 170

చ. కులుకుమిటారిచన్నుఁగవఁ గుంకుమసంకుమదానులేపమున్
దళుకులప్రోవునెన్నుదుటఁ దామరసోదరరేణుచిత్రకం
బళికులవేణివేణి నవహాటకపింజరమంజరీతతిన్
గలికిపిసాళికన్నుఁగవఁ గజ్జలమున్ రచియించి రచ్చెలుల్. 171

చ. పొలుపుగఁజాళువాపసిఁడిపుట్టముగట్టి ఱగానిగారవున్
మెలఁపులపైఠిణిందొడగి మేనిమెఱుంగులతారహారర
త్నలవలయాదిభూషణకదంబవిడంబన ముల్లసిల్లన
త్తెలకినియొప్పమీఱె ససిదీరినమారునివాలుపోలికన్. 172

వ. ఇవ్విధంబున నలంకృతలై. 173

ఉ. తామరసచ్ఛదంబున ముదంబున వ్రాసిరి చేసిరిన్నెఱిన్
గాముని కామనీయమును గాదిలిచిల్కహుమాసుమాళమున్
సోముని సౌమనస్యమును జుక్కలరుక్కలసంబు చందనా
రామలలామశైలశిఖరస్ఫురదాతతవాతపోతమున్. 174

వ. ఇట్లు లిఖయించి కిసలయపీఠంబున నక్రమలపలాశంబు నిలిపి నిభృతరూపంబుల సన్నిధిం గూర్చుండి. 175

ఉ. మొల్లలమొట్టదామరల మోహపుమొగ్గలఁ బొన్నపూవులన్
మల్లెలఁ గన్నెగన్నెరుల మామిడిగుత్తుల రాచకల్వలన్
హల్లకమాలికాపటలనంబురుహాళినిహాళిఁ గేళినీ
వల్లభుఁ బూజచేసి రతివందనపూర్వముగాఁ దలోదరుల్. 176

వ. ఇవ్విధంబున ధ్యానావాహనాదిషోడశోపచారంబుల శంబరారిం బూజించి సఖీజనంబు శకుంతలం జూచి యిక్కాముం గామితార్థంబు సమకూర్పం బ్రార్థింపు మని యాదేశించిన నక్కన్యాలలామంబు మ్రొక్కి మనంబున నిట్లని వినుతించె. 177

ఉ. అయ్యా! రమాతనూభవుఁడవయ్యా! మహానటునోర్చుమేటివీ
వయ్యా! విరాగులంగలఁతువయ్యా! తలంపఁగడిందిజోదవీ
వయ్యా! మదీప్సితంబు వినుమయ్యా! ధరావరు నన్నుఁగూర్పవే
మయ్యా! సమూపరోధివగుమయ్యా! మనిన్ దలఁతున్ రతీపతీ! 178

ఉ. తుంటఁట కార్ముకంబు కరదొట్టిన తేంట్లఁట వింటినారి చే
యంటినవాహనతూపులఁట యప్పులపాలఁట కేతనంబు వా
గంటిపలుంగు గుజ్జుమఁట కాయము లేదఁట నీవు లోకముల్
గొంటుతనంబునం గెలిచితోయిది యచ్చెరియంబు మన్మథా. 179

సీ. నీయశ్వమనికదా నెమ్మిరాచిలుకను బంజరమ్మునఁ బెట్టి పలుకుచుందు
నీతూపులనికదా నెత్తమ్మిపూవుల గారవమ్మునఁ గండ్లఁ గప్పికొందు
నీమామయనికదా నీరజారినిఁ జూచి యాననంబునఁ గూర్మి నలముకొందు
నీసుహృత్తనికదా నిసువుదెమ్మెరనట్లు నాప్రాణపదముగా నమ్మికొందు
గీ. నీపరివారమనికదా నీలకంఠ, మునకు నటనంబుఁ గలహంసమునకు గమన
మనికి శ్రుతి కోయిలకు గానములవరింతుఁ, గోరికలనిమ్ము మనవిఁ గైకొమ్ము మదన! 180

శా. ఏణీమాణవకాక్షియీసరణి నుత్ప్రోక్షస్థలం గేళినీ
ప్రాణేశున్ వినుతించి భూజనుల నారాధించి యాచెంతఁ బూ
బోణుల్ వేమఱు నాడిగంబులు పలుపం బూవింటిజేజేకడన్
బ్రాణాచారము వట్టిలీల విరికొయ్యం జేరి మైమ్రాన్పడన్. 181

వ. ఆత్మగతంబున. 182

ఉ. మక్కువ నుక్కుపం బెడపి మాటికి మాటికి రాజరాజుత
న్నెక్కువ నక్కువన్ బిలుప నింతయు వేఁడిన మానసంబునం
దక్కటికంబుదోఁపమికి హాయని పాయనిచింత నెంతయున్
జిక్కువిరాలి ప్రక్క నునుఁ జెక్కుటఁ జేఁగదియించి విన్ననై. 183

ఉ. ఏటికి వచ్చె భూమివిభుఁ డీవననాటికి ? వచ్చెఁగాక నే
నేటికిఁ బాలబంతినటు నేసితి ? నేసిన నేమి యాఘనుం
డేటికి నన్నుఁ దావలచి యింతలు ప్రార్థన చేసెఁ ? జేయ నే
నేటికి వాని లోఁ గొనక నెల్లిద మైతిని మారుబారికిన్? 184

క. అనుచున్ నలుగెలఁకులు గనుఁ, గొనుచున్ దనుఁదా నవిసివిసిగొనుచున్ మోఁ జే
ట్లనుచున్ సారెకు నుసురసు, రనుచున్ జెలులపహాసింతురని వెఱఁగొనుచున్. 185

వ. ఇట్లు నెలంత బలవంతంబగు వలవంతం బొరలు నవసరంబున. 186

చ. పులుఁగులు గూండ్లఁ దూఱె విరిబోణుల యుల్కులు దీరె భానవా
పలములకాఁక లాఱె రవిఁ పశ్చిమశైలముఁ జేరె దిక్కులన్
దలమగునాఁక దేరె రతినాయకుఁ డమ్ముల నూఱెఁ దమ్ముల
గ్గలముగ వాడఁ బాఱె విరికల్వల తేనియ లూఱె నత్తఱిన్. 187

చ. కరమనురక్తుఁడై పరుషకాంతి వహింపక భర్త చల్లనౌ
కరముల బుజ్జగింప వినఁగానక పద్మిని మోము వాంచె నౌ
కరమనురక్తుఁడై పరుషకాంతి వహింపక భర్త చల్లనౌ
కరముల బుజ్జగింప వినఁగానక పద్మిని మోము వాంచునే? 188

సీ. ఖరకాలకరవాలఖండితవాసర కాసరస్కంధచక్రంబనంగ
సముదగ్రచరమవిశ్వంభరాధరశిఖా పరిపక్వదాడిమీఫలమనంగఁ
బశ్చిమాశావధూపటుతరస్తనతట స్ఫారకాశ్మీరలేపంబనంగ
సాయంసమారబ్ధజలధిసంధుక్షణ క్షణదీప్తబడబాముఖంబనంగ
గీ. విరహిజనజైత్రయాత్రానుసరపనంగ, కేతనస్ఫీతమకరదృగ్దీప్తులనఁగ
నొడలనెఱసంజకెంజాయ లొలయనపర,భాగమునఁ జేరె పద్మినీబాంధవుండు. 189

మ. బలభిన్నీలశిలాకదంబములతో భద్రేభయూథంబుతో
జలదశ్రేణులతో మిళిందములతో జైవాతృకాంకంబుతో
లలనాసంయుతకేశపాశములతో లక్ష్మీధరాంగంబుతో
వలదిందీవరపాలితోఁ జెలిమి వర్వన్ బర్వెఁ గ్రొంజీఁకటుల్. 190

సీ. గగనగంగాతరంగముల తాఁకున మింటఁ జెమలు డిండీరఖండముల మాడ్కి
వియదలత్తాపింఛవిటపచ్ఛటానట జ్యోతిరింగణగణద్యుతులభాతి
శివతాండవక్షణోత్క్షిప్తాజినమునందు నెలకొన్న చిఱుతవన్నియల పగిది
రాజమార్గమునది గ్రామశిరోమణుల్ చల్లునాచారలాజలవిధమున
గీ. యామినికి సోమునకు వివాహమునఁ దనరు, చలువపందిటి ముత్యాలసరుల సరణి
విష్ణుపాదముఁ గైసేయు విరుల పోల్కి, కలిమివాటించె మొలకచుక్కల బెడంగు. 191

ఉ. ఘోరతరాచ్ఛభల్లవనకుంజరపేచకచిత్రకాయమా
ర్జారవిహారవేళలనుశంకదలంకకజారచోరుల
చ్చారుచిరప్రవర్తనలు సల్పఁ దొడంగిరి జాంగలంబులం
దారయ వేమఱుం గనక మక్కట ప్రాణముకంపె తియ్యనా. 192

వ. ఆసమయంబున. 193

చ. స్ఫురితనవోత్పలద్యుతులు చొప్పడ యామిని కామినీభవ
న్మరహరమూర్తియై తనుముసుంగ్చిన వెన్నెలపుల్గువేలుపుం
దొరలకొసంగఁబూనినపినాకిసుధాకలశంబుచాడ్పునన్
పరసకళాకలాపరససాంద్రుఁడు చంద్రుఁడు దోఁచెఁ దూర్పునన్. 194

చ. కుముదినిపొంగెఁ బద్మినులుగోము దిలంగె నభఃస్థలిం జకో
రములు చెలంగెఁ గోకనికరమ్ము గలంగె విధుండు పూర్వభా
గమున వెలింగె నంబురుహబాంధవుఁడు కాంతి దొఱంగె నౌర! లో
కము తనమేలుగాఁ దలఁచుఁగా సగివారిపరాభవంబిలన్. 195

సీ. అంగభూనవముష్టికాస్త్రప్రసారంబొ? రోహిణీజనతనూవిలసనంబొ?
కముదినీకమలసత్కౌముదీసింహాసనంబో? పక్వజీవంజీవపాయసంబో?
ప్రవహిందుమణిగణాసారసారంబో? ఘనదాభిసారికాస్తనపటంబో?
జాహ్నవీశతరణోత్సవసూనసర్గంబో? వియదసుత్కలశాబ్ధివికసనంబో?
గీ. యనఁగ బ్రహ్మాండమండపాభ్యంతరమునఁ, బాలగారయొనర్చినలీల మెఱసి
పుడమినిండఁగఁబోసినపాలపు మిసిమి, పండువెన్నెల నిండె దిఙ్మండలమున. 196

క. శశికరశోభితునికరములు, శ్రీకాంతాసుతునిచివురుచీకరలగతిన్
దాఁకఁగఁజేసుఁగనొప్పుచు, నాకామినిరమణితారికలికియలుకదొలంకన్. 197

ఉ. హాకరుణావిహీన! నలినాహిత! చింతిలుచున్నదాన నీ
వీకడఁ జేసినన్ను వలయుంచెరు సీదురులంబునీఱగుం
గాక గుణంబు మందమగుఁగాక యంబరమ్ము మలీమసంబగుం
గాక భవచ్ఛరీరమురుఖండముఖై చెడుఁగాక దుర్మతీ! 198

ఉ. మందరమెత్తిదైత్యుల నమర్త్యుల నొక్కటిచేసి వాసుకిన్
బంధము త్రాఁడుచేసి హరి పాలసముద్రము చిల్కుటల్ మఱు
ద్బృందముఁ గ్రోసి నా భువనభీకర! నిన్ను సృజించి పాంథులన్
ద్రుంచఁగఁ జేయఁగాఁ గద హహా నల్లనివారల నమ్మవచ్చునే. 199

ఉ. తమ్ముల నేఁచెనో? తెఱవ దాఁచెనో? గౌరవహానిఁ బొగ్గెనో?
యమ్మకచెల్లి హాలహలమన్న దానినణంచి యుత్తమాం

గమ్మున నిన్ను శేఖరముగాఁ గొనియెన్ గుహనాకిరాతకుం
డిమ్మహిఁ బోవలెన్ విషమదృష్టి యెఱుంగునె తారతమ్యముల్? 200

క. నగు మొగమున కోడిన యు, వ్వగదీఱఁగ నగరుకుముదబాంధవునిట్లా
నగకుచ నగియాతనికై, మిగులన్ మొనచూపు నతనిమేనల్లునితోన్. 201

సీ. ఘనజటాజూటంబుకైవడి వెన్నున రాజిల్లు వేణీభరంబుఁ జూచి
హాలాహలశ్యామలాభ మైగళమునఁ బూసినకస్తూరిపూఁతఁ జూచి
భసితానులేపంబువగిది నెమ్మేనిపైఁ గనుపట్టు నంగరాగంబుఁ జూచి
శశికలాభరణంబుసరణి నొదలఁమీద నైకమౌగొజ్జంగి రేకుఁ జూచి
గీ. చిఱుతవెన్నెలపయ్యెదచెఱఁగుఁ జూచి, రాజితంబైనపూఁబాన్పు రమణఁ జూచి
పురహరునిమూర్తియనియల్కఁ బూసితే మొ, యలరువిలుతుఁడ నేశకుంతలనుజూమ్ము.

ఉ. నిండినపండువెన్నెలలు నెక్కొనుకన్నులనీరునున్న పే
రెండకువానకోర్చి కృశవృత్తిఁ దపస్వినులై నమాపయిం
గాండము లేయఁ బూనెదవు గర్వము చేసటు గానసీదుకో
దండము ఖండమై పడు గఢంబు నురూపఱుఁ గాక దర్పకా. 203

ఉ. నీమధుసేవ నీపథికనిష్ఠురవృత్తిని నీయనంగతన్
వేమఱుఁ జూడలేక గదనీజనకుండటు కన్నుమూసెనీ
మామకృశించె నిన్ గనిసమాతయుఁ జంచలభావమందెని
స్సీ మకరాంక! యిట్టిమృతజీవనమేటికి నన్ను నేఁచనే? 204

క. వారనియీఁవసమునవే, మారుస్మారున్ రమాకుమారున్ మారున్
దూరి మిటారి యతనికిన్, దేరై గారించుకమ్మతెమ్మెరతోడన్. 205

ఉ. చందనశైలరాజమునఁ జారుపటీరనికుంజమంజరీ
బృందమువిందు సేయవిహరింపక క్రొవ్వికపాలిశాలికా
ళిందముఁ జాడ సేగెనవాలెమ్ము సమీరకిశోర! దీనమే
లందెదుతత్తనూవిలసితాహిసహస్రముఖాగ్రయాయివై. 206

చ. వలపులకొండడిగ్గికుజవారముఁ బోనటులుత్తరంబుగా
వెలువడి వేగ నేగ వెడవిల్తునికార్యముగాఁగ వచ్చుచోఁ
జిలువలకోఱలం జిదిమి చేరువ నంబులఁ గంటివంతదు
మ్ములుపొడకట్టెనీకుసమున్ వితగాదుగదా మదానిలా. 207

క. మకరాంకునకు న్వెనుకన్, బ్రకటభటార్భటులు పేర్చిపైకొనుమధులి
ట్ఛుకపికకాదంబమయూ, రకములకున్ వెఱచి వెఱచి రమణి యలుకతోన్. 208

సీ. ఫలభంగములు సేయుపనిఁ బూనెదరుగదా కులుకులాయివిమీఁకుఁ జిలుకలార
బలుశిఖండితనంబుఁ బాయఁ జాలరుగదా యెమ్మెలాయివిమీకు నెమ్ములార

కంటకోన్ముఖములై కడు మ్రోసెదరుగదా యాటలాయివిమీఁదు తేఁటులార
పక్షపాతముమీఱఁ బరువెత్తెదరుగదా మించులాయిఁ విమీఁదు నంచలార
గీ. యింక వెన్నెఁడుమాతోడఁ దహితముఁ బూని, ముచ్చటాడరో యాడరో మోమునందుఁ
బోలయరో వెంబడింపరో బోయమరునిఁ, గూడినంత వెయిటులుపోరాడఁదగునె. 209

వ. అని యివ్విధంబున నిందుకందర్పమందానిలమిళిందశుకపికచక్రాంగమయూరవారంబు
లం దూఱుచు నంతకంతకు నగ్గలంబైన బెగ్గలంబున మఱియు నిట్లు వితర్కించుచు. 210

ఉ. వారకపైపయింబొరలివచ్చునహో విరహాంబురాశి నే
నే రహిఁ నీఁదుదానఁ దుదిఁ గన్నెఁడు ప్రారుఁడుమారుఁడేనియుం
దీరముమీఱ నేయఁడొక పెట్టున నెట్టినఁ బోవనట్టియా
వీఱిఁడిజీవమేటికని వేమరు వేమరు లేచుచుండఁగన్. 211

వ. వెండియు. 212

శా. నీరేజారిని దూఱి దూఱి యనిలున్నిందించి నిందించి ప
ల్మారుం మారుని గేలిసేసి విరహమ్లాయత్తనూయష్టియై
యా రాజానన యుడ్ఛ్వసించుచు దృగంతాస్రచ్ఛటల్ చెక్కులన్
జారం గోకిలకాకలీస్వరసుధాసారం బసారంబుగాన్. 213

వ. తదనంతరంబ. 214

తే. ఆకలికికంఠకాకలినాకలించి, చేరఁజనియూఁపజని నిట్టుమారజనిత
తాపమున వేపమానాంగియైనబాలంటి, వెచ్చనూర్పఁగ నచ్చెలుల్ పిచ్చలించి. 215

ఉ. అమ్మకచెల్ల! యేటి వెతలమ్మ! కనుంగవ నీరునించెదే
లమ్మ? విరాళిజాలిఁగొనకమ్మ! ప్రియంబున మాటలాడవే
మమ్మ? లతాంగికిట్టుడగదమ్మ! సఖుల్ వినగానిగోప్యమే
మమ్మ? మనోగతమ్ము నుడువమ్మ! ఘటింతుము బాలికామణీ! 216

క. రావింతుము నీజనకుని, సేవింతుము నీదుకోర్కి చేకూర్పుటకై
కావింతుము నీయిష్టము, భావింతుము మీఁది తెఱఁగు పలుకుము తల్లీ! 217

వ. అని యనేకప్రకారంబుల నచ్చెలులు పచ్చలవిడి ననునయించి పసిండిగిన్నెలంబోని
మెఱుంగుఁ జన్నుల మున్నిరైలోరంగుకస్తూరికసికరమ్ముల నరుణనాళీకనికరమ్ములకర
ణిం బ్రభాకరంబు లగుగరంబులనద్దుచుఁ దిలకింబుదిద్దుచు విమలంబని ముఖకమలం
బునం గమలుసూపుచుం జిమలు శ్రముజాలపంబులం బల్లవంబులన్ విసరుచు మాటికిం
గొసరుచుం జిబుకంబు నివురుచు వీనసిం దివురుచు నక్కునం జేర్చుచు మక్కువ నూ
రార్చు నవసరంబున. 218

తే. జీబిలిమిటారికొంకొక సేదదేరి, ప్రాణసఖులార! నానుడుల్ పరఁగవినుఁడు
లోనదఁచినగుట్టు నాలోనమట్టు, పలుపరామికినింక దాఁపఱిక మేల? 219

ఉ. మొల్లపుమొల్లపూఁ బొదలమొగ్గలనగ్గలమైనతీవలం
దల్లనఁజల్లనై యొలయునందపుఁ గందపుఁగొండగాడ్పుచే
నల్లికబిల్లికందనరు నామిడిమామిడి క్రిందభూమిభృ
త్తల్లజుఁడల్ల జాలరివిధంబునఁ బొంచివహించె డెందమున్. 220

ఉ. నాయనురక్తి చెప్పవలెనాయని యార్యులచాటుదానఁగా
నాయని రవ్వకోర్వఁగలనాయని రాజులపొందుగోరనా
నాయని తత్తఱంబుదగునాయని యింతలు సేయుదాననే
నాయని సంభ్రమింపనగునాయని సైరణసేసితిన్ ధృతిన్. 221

ఉ. అవ్వనుదాతనుం గఱకులాడఁగనేటికి? దాదులైనమి
మ్మెవ్విధిమించనాడ నగుహేయవివర్జితుఁ దాతకశ్యపుల్
బ్రువ్వఁగదూఱఁగాఁదగదు పుట్టిననాఁడె దయావిహీనులై
దవ్వులఁద్రోచిచన్న తలిదండ్రుల దూఱెద సారెసారెకున్. 222

ఉ. పిన్నటనాటనుండియును బెక్కిడుముల్ పడుచున్నదాన నా
బన్నముఁ జెప్పనేల? యిది ప్రాక్తనజన్మకృతంబు దీనికిన్
పన్నియపెట్టినట్లు జనవల్లభుఁ డక్కట! యెంతవేఁడినన్
గన్నడచేసి తత్ఫలముఁగైకొనగంటిని వేయునేటికిన్. 223

ఆ. ఆమనోహరాంగుఁ డనురాగభరితుఁడై, వేవిధముల నన్ను వేఁడుకొనియె
నెంతవేఁడుకొనిన నెక్కసక్కెములాడి, వినక బేలనైతి వెలఁదులార! 224

ఉ. నావెతఁ జెప్పనేల? నరనాథుని మేను శిరీషకోమలం
బీవలరాజుతూపులకు నీవిరితావికడిందికాఁకకున్
దావలమయ్యె నేరహినిదాఁకెనొ యయ్యయొ! యెంతవేఁడినన్
నేవిన నేరనైతినవినీతికిలోనయితిన్ ధ్రువంబుగన్. 225

తే. అధిపుసేమము నా సేమమాకలించి, నేఁడుకవగూర్చియిరువురనిర్వహించి
కనికరముపూనుపరమోపకారులెవ్వ, రీతమకమెట్లుసైతు నే నేమిసేతు. 226

సీ. తరుణప్రసూనకేసరముర్మురంబు పాన్పునబిసాళించిపైఁ బొరలుదానఁ
బ్రోదిమైనిండారుపూఁదేనెకోలఁకున దుస్సాహసము చేసిదుముకుదానఁ
బరువంపుఁజిగురాకుబాఁకుఁ జేకొనిలేచి హుమ్మురంచునురమ్ము గ్రుమ్ముదాన
మెయికొన్నవలపుఁ దెమ్మెరకాఱుచిచ్చులో నాపన్నిదముదీఱనడచుదాన

గీ. నీమరునిబాణములరాక లీసుధాంశు
కళలబలుకాఁక లీమరుత్కందళంపు
జోక లీకోకిలంబులపోకలార్చి
గోల! వేయేల నిఁకతాళఁజాల నమ్మ! 227

సీ. నా మ్రోలనిరతంబు నటనంబుగావించు నెమలియెవ్వరి మ్రోల నిలుచునొక్కొ?
నా వెంటఁ బెనుదంటయై విహార మొనర్చు కలహంసి యేలీలఁ గడచునొక్కొ?
నాహస్తమున వ్రాలి నలువొప్పఁగాఁ బల్కు చిల్క యెవ్వరిచేతఁ జేరునొక్కొ?
నాచేతి మేఁత చే నానాఁటఁ బెనుపొందు నీలేఁడికొదమ ప్రాపెవరిదొక్కొ?
గీ. యనుచు రాజర్షికన్యక పనవి పనవి, యలసి సొలసి ప్రియంవదయంకపాలి
వాలి వ్రాలిన దశదిశల లమెసఖుల, గముల హాహారవమ్ముల కలకలమ్ము. 228

వ. ఇట్లు మూర్ఛిల్లినఁ బ్రియంవదాప్రముఖ సఖీవిసరమ్ము నలుగెలంకుల నక్కన్యకామణిం బొదివికొని. 229

మ. కనుదమ్మిన్ హిమవారిపూరము నుపంగాదంచుఁ దావ్యఘ్న
స్తనకోకమ్ములఁ జంద్రకాంతమణు లుంచం దాళలేదంచు మై
ననకూనం బలుమారు వీజనములూనన్ రాదటంచున్ సఖీ
జనముల్ దేర్చిరి మెల్లమెల్లనఁ జెలిన్ సౌమ్యోపచారంబులన్. 230

వ. తదనంతరంబునం బ్రియంవద దరహాసభాసురముఖి యగుచు ననసూయతో మెల్లన నిట్లనియె. 231

సీ. పుట్టినప్పుడె గాధిపట్టి గాడసిపట్టెఁ బాదిపక్కినమాట సూనృతంబు
మాలినీతటసీమ గోలఁ గాంచెపడించు నూర్ధ్వరేతుని వాక్య ముత్తమంబు
ప్రోదికై మనలఁ బంపుచుఁ జేయు నదితికశ్యపుల సంవాదంబు సమ్మతంబు
తరుణిచిన్నెలు చూచి దైవజ్ఞులగు మునుల్ నిర్ణయించిన మాట నిక్కువంబు
గీ. నిఖిలరాజాధిరాజమాణిక్యమకుట, తటఘటితపాదపద్ముఁడై ధరణి నాల్గు
చెరఁగులేలెడు దుష్యంతుఁ జెట్టపట్టి, భూరిసౌఖ్యములందు నీపువ్వుఁబోణి. 232

వ. ఇట్లగుటం గాలయాపనంబునకు సమయంబుగాదు. చేవచ్చునంతకు నిక్కన్యారత్నంబు నతిప్రయత్నంబున సురక్షితంబు గావించునది యని యనసూయాదులకు నొప్పం జెప్పి నరేంద్రస్కంధావారంబుఁ బ్రవేశించె ననినవిని జనమేజయుండు తరువాతి చరితంబు వినవలతు ననుటయుం. 233

ఆశ్వాసాంతము.

క. శ్రీసురపూజాస్పదపద, భాసురవాసరకరోదవసితాలసిత
త్రాసురరక్షాదక్షమ్రా, తాసురచంక్రమణ! వేంకటాచలరమణా! 234

మాలిని. విమలకమలనేత్రా! విక్రమాక్రాంతమిత్రా!
ప్రమదకరచరిత్రా! ప్రస్ఫురత్పత్త్రిపత్రా!
కుమతితృణలవిత్రా! కోమలశ్యామగాత్రా!
యమితగుణపవిత్రా! యబ్ధికన్యాకళత్రా. 235

గద్య. ఇది శ్రీమత్కోకసల్యానందన ప్రసాదసమాసాదితకవితావిచిత్ర మైత్రేయసగోత్ర నృసింహాగురుపుత్త్ర కృష్ణకవిప్రణీతం బైనశకుంతలాపరిణయం బనుమహాప్రబంధంబునందు దుష్యంతుండు కణ్వాశ్రమంబుఁ బ్రవేశించుటయుఁ శకుంతలాసంవాదంబు బ్రియంవదపలననమ్మహీకాంతుండు శకుంతలాజన్మప్రకారంబు వినుటయుఁ సేనానివేశంబును జలక్రీడయుం జంద్రమన్మథాద్యుపాలంభంబును శకుంతలావిరహావేదనాభరంబు సైరింపంజాలక ప్రియంవద నరేంద్రస్కంధావారంబుఁ బ్రవేశించుటయుం నను విశేషంబులు గలిగిన ద్వితీయాశ్వాసము.

---

శ్రీ ర స్తు.

# తృ తీ యా శ్వా స ము.



రమ్యా వైజయంతీ
తోరణవిభ్రాజమానదోర్మధ్యగృహా!
ధారశ్రీసంసేవ్యా!
గీరమణ స్తవ్య! శేషగిరివాస్తవ్యా! 1

వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు ప్రియంవద నరేంద్రస్కంధావారంబుఁ దఱిసి తిరస్కరిణీప్రభావంబున నంతర్ధానగతయై మెల్లన రాజమందిరంబు సొత్తెంచి కలయంగనుంగొనునవసరంబున. 2

శా. ఆరాజన్యుఁ డనన్యగోచరమనోజార్తిజ్వలన్మూర్తియై
యారాజర్షిసుతాధరాధరసుధాహారంబుపైఁ గూరిమిన్
సారస్ఫారచతుర్విధాన్నఫలమజ్జాపాయసాపూపప
ల్లారాద్యుత్తమభుక్తిమానసమునన్ లోభింపఁ డింతేనియున్. 3

వ. ఇట్లు శకుంతలావిరహానలసంతప్యమానమానసుండై యమ్మానవేశ్వరుండు. 4

సీ. ఉదయదిందుప్రభాభ్యుదయసంపదలకుఁ దలసూపనోపక తలఁగి తలఁగి
కలకంఠకులకంఠకాకలీకలనంబు కర్ణగోచరమైనఁ గలఁగి కలఁగి
మరుఁడేయుఁ గేదంగివిరికతారపుప్రేటు మదికగ్గలంబైనఁ గలఁగి కలఁగి
చందనాచలమరుత్కందళంబులవారి దురవగాహంబైనఁ దొలఁగి తొలఁగి
తే. తేపమీఱఁగఁ దల్పంబు డిగ్గిడిగ్గి, తేపతేపకు నిట్టట్టుఁ దివిరితివిరి
పొలఁతి చెలువంబుమాటికిఁ బొగడిపొగడి, వసుధ వ్రాయుచు మోమువాంచివాంచి. 5

ఉ. హా! యను మౌనిరాజతనయా! యను హాయనిపల్కవే మిటా
రీ! యను రమ్యసమ్మదకరీ! యనుఁ గన్నడసేయఁ గోలతాం
గీ! యనుఁ దాళఁజాలఁ గటకీ! యను ముద్దిడనిమ్ము కీరవా
ణీ! యను జాలమేల తరుణీ! యను రాజు విరాలిఁ జాలిచేన్. 6

వ. ఇట్లు మునికన్యకాధ్యానపరాధీనుండై యున్మత్తప్రలాపంబులఁ బొరలునన్నరపరుం
జేరంజని. 7

సీ. తివుటఁ దియ్యనితేనె దివురువాతెఱగంద నుసురసురనివెచ్చనూర్చువానిఁ
జెక్కుటద్దములపైఁ జిందిజీరలువాఱ నిభృతుఁడై కన్నీరునించువాని
గోరంతసడిఁ గన్నగుండె జల్లురనంగ సొలసిదిక్కులు దేఱిచూచువాని
మేనఁబుప్పొడియొత్తఁగానొయ్యనొయ్యన విరులపానుఁపుమీఁదఁ బొరలువాని
గీ. మదవతీ! మత్తకాశినీ! మంజుభాషి, ణీ! మనోహారిణీ! మానినీ! మరాళ
గామినీ! యెంతవేఁడినఁ గనికరమ్ముఁ, బూనకేఁ చెదవనియార్తిఁ బొరలువాని. 8

ఉ. కాంచి చతుస్సముద్రపరిఖావృతభూవలయాధినాథుఁ డ
క్కాంచనగాత్రి కన్నఁ దమకమ్మునఁ జింతిలుచున్నవాఁడు భా
వించఁగఁ దుంటవింటిదొరవీరలయిర్వురపొందుఁ గూర్పనూ
హించె బళీ! యటంచుఁబృథివీశునకుం బొడసూపె నమ్రయై. 9

వ. ఇవ్విధంబున. 10

క. జయజయశబ్దంబులతో, భయసయముల మ్రోలనిలుచుపద్మదళాక్షిన్
బ్రియమునఁగనుఁగొని యిట్లను, నయనయదయమానమానసాబ్జుండగుచున్. 11

మానిని. సేమమె తామరసోదరసోదరచిత్రవిభాననశాలినికిన్ ?
సేమమె ఘాలచలాలకజాలకశీర్యదవార్యమహాలినికిన్ ?
సేమమె ఫుల్లసువర్ణసువర్ణవిజిత్వరదీధితిమాలినికిన్ ?
సేమమె భావజభావజరాపవహాశీలవిడంబితకేలినికిన్ ? 12

ఆ. అనుచుఁ బెక్కుమారులత్యాదరంబునఁ, గన్నె సేమమరయుచున్నఁ జూచి
సన్నవాఱనగుచుసకియ ప్రియంవద, పార్థివేంద్రుఁ జూచి పలికె నిట్లు. 13

ఆ. తడవులేదుచూచి ధరణీశ ! యింతలో, సేమమరయుటెల్ల చిత్రమయ్యె
నతనుమంత్రసిద్ధు లగుమహాపురుషుల, కెగ్గుసేయసేమ మెట్లుగలుగు ? 14

ఉ. భావజరూప! నిన్నలరుబంతినగల్చినయంతనుండియున్
దావలమైనభూరిపరితాపమునన్ మునికన్య ఖిన్నయై
పూవులదండలున్ వలచుపూఁతలుసొమ్ములుభక్ష్యభోజ్యముల్
కావలెనంచుఁగైకొనక గాసిలుచున్నదిసూనశయ్యపై. 15

ఉ. ఆదినిబుష్పబాణరసమంతరుదంతముగ్రాఁచెనగ్గమై
యూదటనవ్వసంతకుసుమాకరముం బ్రతికూలమయ్యెఁజం
ద్రోదయమంతకుంగరఁచుచున్నది రాజమృగాంకసేవచేఁ
బైదలిమేనుసౌఖ్యమునఁ బాటిలునోయనిమిమ్ము వేఁడెదన్. 16

క. ముదుసళులవ్వయుఁదాతయుం, హదమనజనకుండు తీర్థయాత్రకు వెడలెన్

మదిరాస్యయొడలిబడలిక, యిదమిత్థమటంచుఁ దెలియ దెట్లోకోమీఁదన్. 17

సీ. బింబోష్ఠి రాజకీరంబు నొయ్యనఁ జూచి చదురులాడఁగ నోడికొదుకుచుండు
నంభోజముఖి రాజహంసంబు వెనుకొన వెలవెలఁబాఱుచు వెనుకఁ ద్రొక్కు
జలధరవేణి రాజమయూర మెదురెక్కఁ బరిపరివిధముల బ్రమసిపాఱు
రమణ నుత్పలగంధి రాజబింబముఁ జూచి యాదర్శనంబోలమూసగొనును

తే. రాజపదముద్రితపదార్థరాజియెడల, భయముగొని యున్న యది మిమ్ముఁ బరిభవించి
కాననీయాన యనృతమ్ము గాదుసుమ్ము, రమ్మభయమిమ్ము కొమ్మకు రాజమౌళి! 18

వ. అనుచు మఱుంగుపఱిచి తన్నుం దోడ్కొని చన నుద్యోగించు ప్రియంవదవైయాత్యం
బునకు మనంబున మెచ్చుచుఁ గామితార్థంబు సమకూడుటం బొడముకౌతుకంబు
మొగంబునం దోఁపనీక పుయింగోటదక్కి రాజకంఠీరవుం డక్కలకంఠితో నిట్లనియె.

తే. ఏటువడి గ్రుక్కమిక్కనకిట్టులొంటి, నేసితాగాసినొందుట కేమికతమొ?
యగునగును మేలు మేలుగయాళికలికి, కలికితనుగంటి తెరగంటికలువకంటి! 20

తే. బాలసఖ్యం బకారణప్రహాసనంబు, స్త్రీవివాద మసజ్జనసేవ చనవు
లేనిమురిపంబు రాగంబు లేనిపొందు, కానిపనులంద్రు బుధులు నిక్కంబు పూవె. 21

ద్రుతవిలంబితవృత్తము. అలవసిష్ఠమహాముని నెమ్మెయిన్, గలఁచు గాధిజు కాముని బాధ
మెలఁచికూడిన మేనకపట్టిరో, చెలఁగు లేమకుఁ జేష్టలు వింతలే. [లన్ 22

క. సామోపక్షేపంబుగ, భూమీశ్వరతిలకుఁ డిట్లు పొరిఁబొరిఁ బలుకన్
దామరసానన యానన, తామరసముఁ బ్రేమరసము దలకొనఁ బలికెన్. 23

ఆ. బాలముద్దరాలు పసిగాపుగసుగందు, కూనముద్దుగుమ్మ గోలయబల
యాఱితాఱిలాడ నెట్లు నోరాడెనో, రామరామ! నిరపరాధసుమ్ము. 24

ఉ. ఆగమసమ్మతంబనుచు నార్యులు పల్కు దురార్యులైనయు
భ్యాగతులెద్ది వేఁడినఁ దదర్థము సిద్ధిలఁ జేయుటల్ మహా
భాగుఁడవీవు నీదయిన ప్రార్థితముల్ సమకూరుని త్తఱిన్
రాగముతోడ నచ్చటికి రమ్ము సపర్యలుగొమ్ము కొమ్మ చేన్. 25

వ. ఇంకంగుతర్కకర్కశవాదంబులం బనిగొన దేమును బహువిధంబు లగునుపచారంబు
లాచరించితి మెద్దియు నమ్ముద్దియ యతనుతాపంబునకుం బ్రతీపంబు గాదయ్యె నట్లగుటనత
నుతాపం బనితోఁచుచున్న యది యదియును యదనంతరన్యాయంబున భవద్దర్శనా
నంతరసంజాతంబగుట నవ్వేడఁగునకుం బునర్దర్శనం బొసంగి కను వేదుఱుదీర్చి
యూఱార్చునది దీనసీకును నాచంద్రార్కంబుగాఁ గీర్తిపౌరుషంబులు నెలకొను
నట్లగుట మద్వచనప్రకారంబున శీఘ్రంబ యక్కన్యాసన్నిధానంబునకు రావల
యునని సవ్యాజంబుగా సూచించిన నొడంబడి స్వచ్ఛందనచీనాంబరాభరణంబుల
నలంకృతుండై గూఢప్రకారంబున నిజస్కంధావారంబు వెలువడి, 26

సీ. ముఖపూర్ణశశియోగమునమించుగవిలీలఁదగురత్నమకుటమాదలఁదలిర్ప
హస్తాబ్జములవ్రాలునళులునానీలంపుటుంగరంబులువ్రేళ్లనొఱపునెఱప
గాత్రకాంచనయష్టిఘనదీప్తిరింఛోళి చెలువునఁబచ్చనిచేలజీరఁ
జివురులగెలువఁదాల్చినకెంపుజోడుల కరణినంఘ్రులమోచికలురహింపఁ
తే. గంతకలితసరస్వతిఁ గౌఁగిలించు, నమరనదిభాతినురమునహారమడర
నంగభవమంగళాకృతినాశ్రమంబు, ఠీవిమైఁ జేరెదుష్యంతభూమిభుండు. 27

వ. ఇవ్విధంబున నాశ్రమంబుఁ బ్రవేశించి చనునవసరంబున. 28

సీ. పోఁగూడదీదారిఫుల్లహల్లకసార కాసారసీసారకర్దమంబు
చనఁగూడదీదారిసన్నాగళస్నాగ పున్నాగభిన్నాగసన్నుతంబు
చొరఁగూడదీదారివరసంకుమదపంక పంకిలైణాంకోపలాంకితంబు
గమిగూడదీదారిసుమగుంజదలిపుంజ పంజరీకృతమంజువంజులంబు
తే. నాథ! యిదిశప్వరంపుటనంటికోన, మహిప! యిదిగో స్తనీకాయమానసరణి
నృపకులాగ్రణి! యిదిమాలినీప్రవాహ, మధిప! యదెచూడుము శకుంతలావసథము.

వ. ఇవ్విధంబున సూచింపం బ్రియంవదావదనారవిందకందళదమందమకరందబిందు
సందోహంబులఁ దుందిలహృదయహిందోళుండై యారాజపురందరుండు ముహు
ర్ముహురుల్లలన్మాలినీకల్లోలఘుమఘుమారావంబు మార్దంగికవిమర్దనపరిణద్ధమర్దళని
నదంబుగా, మధురమధురసప్రలుబ్ధముగ్ధమధుకరనికరఝంకారంబు శ్రుతిప్రకారంబు
గాఁ గోకిలకలస్వనవితానంబు గానంబుగాఁ, జిత్రం బగువాదిత్రంబునకుం బాత్రంబు
లయి మాద్యన్మయూరకళత్రంబులు నర్తనంబులుం బ్రవర్తింప, నిలింపకుటవిటం
పాంతరనిర్యత్సుధాసుధాకరకలాపంబు కరదీపికారూపంబయి నలుగెలంకులగండలు
కొను సంధ్యాతిమిరంబుల నెడగలుగం జడియుచు మలయానిలవలనవిలులితలవ
లీలవంగలుంగాదివివిధకుసుమకేసరపరాగపటలంబు మంగళాచారసముత్సారితపిష్టాత
కంబుగాఁ, గూజచ్ఛుకనికరకాకలీకలకలంబు పుణ్యాహఘోషంబుగా, మహోత్స
వంబున శకుంతలాభవనంబుఁ బ్రవేశించునవసరంబునం బ్రియంవదాప్రేరితలై
తత్పరిచారికాజనంబులు నీరాజనంబాచరించి, సప్రణయంబుగా నభ్యంతరంబునకుఁ
దోడ్తేర నుచితపీఠంబునఁ గూర్చున్నయన్నరనాథు నర్ఘ్యపాద్యాదివిధులం బూజిం
చి, సఖీజనమధ్యంబున లజ్జావినమ్రమౌళియై యున్నయక్కన్యామణిం జూచి
దుష్యంతమహీకాంతునితోఁ బ్రియంవద యిట్లనియె. 30

సీ. పనులసందడినైనఁ బరులవీనులుసోఁకఁ జేరెలుంగిడలేనిభీరుమధ్య
ప్రహసనంబుననైనబాహిరంబగునట్లు పకపకనవ్వనిపద్మగంధి
యాసాయమభ్యాగతార్చనంబుననైన నలసితిననిపువ్వారుఁబోణి
సతతంబుతనప్రాణసఖులతోనైనను భావంబుబయలుకొల్పనిలతాంగి

తే. యూర్ధ్వరేతుని పెనుపున నోజఁగలిగి, యుభయకులమును దనకీర్తి నుల్లసిల్లఁ
జేయఁగలసాధ్వి యీలేమ చిత్తవృత్తిఁ, దెలిసి పాలించుకొనుము ధాత్రీకళత్ర! 31

వ. అని చిఱునవ్వు దళుకొత్త గూఢప్రకారంబుగా రాజునకు నక్కన్య నొప్పఁజెప్పి తక్కటి యనసూయాదులఁ గనుసన్నలం గలిపికొని. 32

సీ. అదిలికళ్యపులిప్పుడలివేణిమైకప్పు వినిచూడఁదగునంచు వెడలె నొర్తు
మొన్ననాటిలిమొక్కముంతమామిడిమొక్కఁ దోయమెత్తెదనంచుఁదొలఁగె నొర్తు
చిఱులేటికొదమబిత్తరపుఁజూపుక్కలు నేర్పి పూరిమే పెదనంచుఁ బోయె నొర్తు
కలమంపుటెండువుల్ గవయుంపుఁబంతువుల్ చూచివచ్చెదనంచు జాఱఁగె నొర్తు
లేఁతనివ్వరిదొంపులేటిపిల్లలకింపు కాచియుండెదనంచుఁ గదలె నొర్తు
తే. ధార్యమరసెదననితప్పదాఁటె నొర్తు, వైద్యుఁబిలిచెదననిజాఱువాఱె నొర్తు
మాయములుపన్ని యీలీల మహీపుమ్రోల, బాలనిడి పోల నరిగిరి ప్రాణసఖులు. 33

వ. ఇట్లు తన్నొక్కతెం డించి సఖీజనంబు నలుగెలఁకులం దలఁగిన నుజ్జాతంబులగు లజ్జా భయంబుల నజ్జలజముఖి నృపాలునిపజ్జ నేకతంబ నిలువఁజాలక. 34

చ. కులుకులెసంగ నబ్బురపుగుబ్బలుగుబ్బతిలంగ మేనిచా
యలు చిలుకంగఁ గొనుసులియుంగ మొగమ్మునఁ గ్రమ్మిచెమ్మటల్
జిలిబిలిపొంగఁ బొందళుకుఁజేలమెఱుంగడరంగఁ గంకణా
వలి గలుగల్లనంగఁ బఱువంగమకించె లతాంగి సిగ్గునన్. 35

వ. ఇత్తెఱంగున నంతరంగంబునం దుఱంగలిగొను వెఱంగునం గుఱంగట నిలువంజాలక నక్కురంగలోచన మెఱుంగుదీవియకరణిమణిస్తంభంబులమఱుంగునకుఁ బరుంగు వాఱినం బదత్రయమాత్రంబున నద్ధాత్రీకళత్రుం డక్కాంచనగాత్రిం దొట్టిచేపట్టి కవుంగిటికిం దిగిచిన నెగిచి దిట్టతనంబున నిట్టట్టు గికురుపఱిచి సురుచిరగతిం బఱచినం గెరలినమరులునఁ గ్రమ్మఱినమ్మరువంపుమొలకం బలుకరించుచుం గదిసి సన్మధ్యంబగు నక్కన్యకామధ్యంబుఁ బిడికిటంగీలించి లాలించుచు నధరామృతం బాస్వాదింపం గమకింపం దమకింపక చంపకగంధి గంధసింధురం బాక్రమించినం జలియించుతరుణ కరిణీలలామంబుచాడ్పునం గాడ్పునం గదలుకందళీకాండంబుకైవడిం గైవడి నెడగలు గంజడియుంచు నొడంబడ సెలయించం బంచశరశరపరంపరాపరాభూతంబైన సుహృ జ్జలజాతంబులో నిట్లనియె. 36

క. పలికిపలుకవు మరుపూ, ములికీ! యీయంచగముల మురిపంపుహళా
హాలికిపరిసరతరుసర, దలికీరార్భటికి డెందమలికిఁ గలికీ! 37

సీ. విరహాపాథోరాశివెల్లివిఁగఁ దొడంగె ననుదరిఁజేర్పుము నావభంగిఁ
గామాంధకారంబు భీమమైకెరలించెఁ గదతేర్పుముగ దీపకలికభాతి

మదనమాంద్యమున నెమ్మది బోధ రాదయ్యెఁ గావుము సంజీవకరణికరణి
నతనుతాపభరంబు మితిమీఱి సొగియించె మనుపుము శర్కరాంభముల పగిది

తే. నతులతావకరూపరేఖానురాగ, రసఝురవిహారకలితజాగ్రన్మనోజ
భూతవేదన నెంతయుం భీతి వొడమె, యువతి! నీసూక్తిమంత్రమ్ము లోలయనిమ్ము. 38

సీ. మొనగుబ్బ లెదఁ జేర్చి మోవితేనియ లిచ్చి ముచ్చటల్ దీర్పవే ముద్దుగుమ్మ!
కొసరు వైపులనవ్వి కొనగోట దువ్వినా తమిని స్తరింపవే తలిరుఁబోణి!
పొందిపాయఁగఁ బాసి పొలయల్కఁ జేసినా బోధనల్ వినఁగదే పువ్వుఁబోణి!
మగచందమునఁ గల్కి మాయముల్ పల్కినా మదికింపుఁ గూర్పవే మచ్చెకంటి!

తే. పరిపరివిధంబు రతులకేర్పడిన మేటి, యంగముల కెల్లనునికిపట్టైన బోటి
విరులసింగాణి సురధాణి విజయధాటి, మేదినీస్థలిఁ గలుగునే నీదుసాటి. 39

వ. అని యనేకప్రకారంబులం బ్రార్థింప సాచిస్మితలసితంబుగా మొగంబు వాంచి యొక్కిం
చుక భావించి యక్కాంచనగాత్రి గోత్రాకళత్రునితో నిట్లనియె. 40

ఉ. అక్కట! తాతకశ్యపుల యాదరణంబున నున్నదాన న
న్నెక్కటి నిట్లు నే కొనుట యే వివరంబిది యేటిగొండ్లి మీ
యక్కఱదీఱినం బిదప నాఱడిఁ ద్రోచెద రేల యేల నే
నెక్కడిదాన నయ్యెద మహీవర నే వరమర్థి వేఁడెదన్. 41

ఉ. వైళము కణ్వులింతకును వత్తురు వారలయానతిం గడుం
దాలిమిఁ బెండ్లియాడుము యథావిధి నంతకు నీకు నెమ్మదిన్
దాళికలేకయుండిన హితమ్ముగు నేనియుం నగ్రభార్యగా
నేలుము నన్ను మత్సుతునకిమ్ము మహీవలయమ్ము సమ్మతిన్. 42

సీ. అదితిమాయవ్వ కశ్యపుఁడు మా తాతసూ తొలుతవారల కెట్లుదోఁచునొక్కొ?
తాతకశ్యపులచిత్తము కంచుపదనుసూ దుర్వృత్తయని ప్రేమ దొఱఁగునొక్కొ?
నాప్రాణసఖుల చందము నమ్మరాదుసూ సుబ్బుసుబ్బుల దూఱఁ జూతురొక్కొ?
యంది పొందిన వారలాచారపరులుసూ బాగుగాదని బాహ్యాపఱుతురొక్కొ?

ఆ. యహహ! రాజరాజ యాజవంజవసుఖా, సక్తియుక్తి నోలి సాహసమున
నీమనోరథంబు నెఱవేర్తునేనియుం, నవుల నెట్లు సైఁతు రార్యజనులు. 43

వ. అని యిట్లు బహుప్రకారంబులం బరిహరించు నమ్మించుఁబోణి నుపలాలించుచు
నిట్లనియె. 44

శా. కానిమ్మేనిను నెమ్మి నగ్రమహిషింగా సంతరింతున్ భవ
త్సూనుం బట్టము గట్టుదున్ మనకు సాక్షుల్ వాసరంబుల్ నిశల్
భానుండున్ శశి పంచభూతములు దిగ్భాగంబులున్ గాలమున్
శ్రీనారాయణదేవుఁడుం గలఁడు శిక్షింపంగ రక్షింపఁగన్. 45

వ. అని యమ్ముద్దియ నెట్టకేలకు నొడంబఱిచి సురుచిరాకల్పం బగుకిసలయతల్పంబునకుం దిగిచి. 46

శా. కాంచున్ గామిని కామనీయము బలాత్కారంబునం గేలఁగీ
లించున్ వేనలి చెక్కునొక్కు కడుబల్మిం గుబ్బపాలిండ్లనం
కించుం గౌఁగిటశయ్యకుం దిగిచి సొక్కించుం గళావైఖరిన్
గించిన్మధ్యఁ గరంచి యీసరణి భోగించెన్ విభుండయ్యెడన్. 47

సీ. కొమ్మ! నీ నెఱికురుల్ కొదమతుమ్మెదలంచు సోయగం బరుదారఁ జూచు నొకటఁ
గలికి! నీకెమ్మోవి కండచక్కెరయంచు గొడఁగిపానకమానఁ గోరు నొకట
నెలఁత! నీచెక్కులు నిలువుటద్దములంచుఁ దన మోము రహిఁ గాంచఁదలఁచు నొకట
భామ! నీపాలిండ్లు పసినిమ్మపండ్లంచు నీటు గాఁగొనఁ గోటమీటు నొకటఁ
తే. గులుకుల మిటారి! చిలుకలకొలికి వనుచుఁ, జెలఁగ తమిదీఱఁ గౌఁగిటఁ జేర్చు నొకట
బాల! నీలీలఁ గరఁగించి పార్థివుండు, హాళి నిష్టోపభోగంబు లందుచుండె. 48

వ. మఱియును. 49

సీ. కొసరి వాతెఱనొక్కి కసుఁగందెనోయంచు నిరతుఁడై ముంగేల నివిరినివిరి
గోటఁ గుబ్బలు మీటిన నొచ్చెనోయనుచుఁ దా నార్తిఁ జేఁ గుంకుమం బలఁదియలఁది
వెలయఁ బొన్పునఁదార్చి విరులొత్తెనోయంచు వగపుచే నురము పైఁ దిగిచి తిగిచి
తమిదీఱ భోగించి శ్రమమయ్యెనోయంచు వెఱపుచే వీవనల్ విసరివిసరి
తే. సోయగముఁ గాంచి తిలకించి సొబగుమించి, మరులు గెరలించి కెరలించి మదిఁ గరంచి
యఱమరలు దీఱ లాలించి యామతించి, కలికితొలికూటమి విభుండు తులకరించె. 50

సీ. తరసాఘన స్తనస్తబకాదయాశ్లేష చలితబాలావక్త్రజలరుహంబు
పలికరవ్యతికరభ్రశ్యత్పునారూఢ వనితానవాపకుంతనపటంబు
రమణసంక్రమణసంభ్రమవివర్తితయోషి దక్షిణాంగసంగిభూషారవంబు
పురుషాధిగమసుఖస్ఫురితాశ్రులవలస న్ముగ్ధాముఖాబ్జనేత్రముకుళనంబు
తే. రభసవిలులితశయ్యోత్తరచ్ఛదంబు, పులకచులుకితదర్పణోత్ఫుల్లగల్ల
ముల్లలత్కేశపాశమన్యోన్యరాగ, నిరతిశయ మయ్యె నవయౌవనిధువనంబు. 51

శా. ఆలోలాలక మాచలత్కుచభరం బాస్విన్నగల్లద్వయం
బాలీఢప్రియపాణిపల్లవనితంబాశ్లేష మామీలదు
న్మీలల్లోచన మాత్రపాభరదరస్మేరాననాంభోరుహం
బాలంబాభరణంబు గాసుపరతం బాలేమ సల్పెన్ ధృతిన్. 52

వ. ఇవ్విధంబున నాదంపతు లతులసంపదలం బొదలుచు నిద్రాపారవశ్యంబునం దనరు నవసరంబున. 53

ఉ. తోయజవైరి మాసె రవిదూర్పుదెస న్మోన చేసెఁ జుక్కలుం
జాయలుదీసెఁ గైరవిణిసైకమునంగను మూసెఁ బద్మినీ
నాయిక కుందువాసె రతినాథుఁడు వాలొరఁజేసెఁ గొక్కరో
కోయని కోడి కూసెనలకోకిని గోకముడాసె నత్తఱిన్. 54

ఉ. పూవులతావులం దనరి పొందిక కందిక లియ్యఁ శయ్యలం
దీవలనావలం బెనఁగి యింపు రహింప సతుల్ పతుల్ ధృతిన్
భావజకేళిఁ దేలుసెడఁ బన్మినచెమ్మటలారఁ దోరమై
వీవఁదొడంగె నంగముల వేఁకువ లేఁకువఁ గమ్మదెమ్మెరల్. 55

ఉ. సారలసత్సహస్రకరశాఖలతో నినుఁడుగ్రమూర్తియై
ఘోరతమమ్ములం దొరగఁగోరిన మున్నడియై యనూరుఁడున్
ధీరతమీఱ నయ్యరులతేకువమాన్చఁ దలంచినన్ మహా
శూరులఁ జేరుభీరులును జూపుదు రుద్ధతి యుద్ధతీవ్రులై. 56

వ. ఆసమయంబున: 57

ఉ. గాములమేటి లోకములకన్ను తమమ్ములమిత్తి యామినీ
భామతొలంగుబావ సెకవాఁకలగుండము చక్రవాకపు
న్నోములపెట్టుపంట పదినూఱులచేతులజోదు పచ్చబా
బామొనచూపుతేగిదొరభానుఁడు తూర్పునఁదోఁచె నత్తఱిన్. 58

క. ఆలోనన తా మేల్కని, బాలారత్నంబు కూర్మిపతికౌఁగిటిలో
నాలీఢయగుటఁ గదలక, మేలమ్మునసుండె విభుఁడు మేల్కనుననుచున్. 59

వ. తదనంతరంబ మేల్కాంచినపతింగాంచి సప్రణయంబుగాఁ దచ్చరణంబుల కెరఁగి
తదనుజ్ఞాత యై. 60

శా. వీడంబాఱిన నీవితోఁ గటినటద్వేణీలలామంబుతో
వాడుం దేఱినపువ్వుమాలికలతో వ్యత్యస్తహారాళితో
వ్రీడానమ్రముఖంబుతో శ్రమజలావిద్ధాంగరాగంబుతోఁ
గ్రీడాతల్పము డిగ్గె బాల సురతక్లేశావనమ్రాంగియై. 61

వ. ఆసమయంబున. 62

శా. తానుం బానుపు డిగ్గి యగ్గలిక నద్ధాత్రీకళత్రుండు స
న్మానానూనకటాక్షవీక్షణములన్ మన్నించుచున్ బ్రీతుఁడై
చానం గౌఁగిటిలోనికిం దిగిచి విశ్వాసంబుతో నిట్లనెన్
మానం బేటికి ముద్దుగుమ్మ! సెలవిమ్మా సమ్మతిన్ వీటికిన్. 63

తే. అనుచు గమనోన్ముఖుండైనయధిపుమోము, రాచకూఁకన్నె తప్పక చూచిచూచి
ప్రాణనాయక! నిన్నెడఁబాయఁజాలఁ, దోడుకొనిపొమ్ము నన్ను నీతోడ నెమ్మి. 64

మ. అనుచుం గుత్తుకదొట్రుతేఁ బలుకుతో నాకుంచితాంగంబుతోఁ
గనుదోయిన్నెలకొన్న బాష్పములతో గాటంపునిట్టూర్పుతో
జనితస్వేదకపోలపాలికలతో జవ్వాడుమధ్యంబుతో
వనితారత్నము వెన్నడిన్నడువ లేవన్ భూవిభుం డిట్లనున్. 65

క. కొమ్మా! యిచ్చోటనె నెల, కొమ్మా నెచ్చెలులఁ గలసికొమ్మా నెఱిచే
కొమ్మా కులపతియనుమతిఁ, గొమ్మా నాసేమమరసికొమ్మా పిదపన్. 66

ఆ. ఆజ్ఞ మీఱినడచి యయ్యయ్యొ! దీనికి, వన్నె వెట్టినట్లు వంచనమున
వచ్చెదేని గారవమ్మున నినుఁజూడఁ, గానకలుగు మానిమానసమున. 67

క. కోపించుం గ్రక్కున నా, క్షేపించున్ గాన మానిచిత్తముకూర్మిన్
రూపించినగరమాదటఁ, బ్రాపింపుము హితులఁ బనుతుఁ బద్మదళాక్షీ! 68

వ. అని బహుప్రకారంబుల నొడంబఱిచి గాఢాలింగనం బాచరించి యక్కాంతాలలామంబు సప్రేమంబుగా వీడుకొలుపం బ్రీతుండై యశ్రమంబున నయ్యాశ్రమంబు వెలువడి బలువడిం బయనంబు సాటించి చతురచతురంగసేనాపరివృతుండై హస్తిపురంబుఁ బ్రవేశించి యథాపూర్వకంబుగా రాజ్యంబుఁ బాలించుచుండె నంత నిక్కడ శకుంతలావధూటియుం సవ్రీడంబుగా సఖులకుం బొడసూపి యథోచితవర్తనంబునం బ్రవర్తిల్లుచు నాత్మగతంబున. 69

సీ. వచ్చెఁబో కణ్వసేవాకుతూహలమునఁ బొదలచాటునరాజు పొంచనేల?
పొంచెఁబో చిలుకనుబూబంతినటువేయఁ దప్పియవ్విభుఱొమ్ముఁదవుల నేల?
తవిలెఁబో యొకనిమిత్తము చేసియొడయండు భావజాప్తంబుగాఁ బలుక నేల?
పలికెఁబో తల్లిదండ్రులయాజ్ఞ గొనకనే జగతీశ్వరునికూర్మి సలుప నేల?
తే. చలిపిలినిబోన్నృపాలుండుసంయమీంద్రు, నాజ్ఞఁగొనినన్నుఁదోడ్కొనకరుగ నేల?
తలఁచినతలంపె ప్రపంబుఁ దలఁచెనకట! యెట్టుగానున్నదో కొమీఁదనీశ్వరాజ్ఞ? 70

క. ఆమునికులసోమునితో, నేమని వివరింతు మఱియు నిదివివరింపన్
గామిని పరగామినికొఱ, గామి నిజంబనుచుఁ గనలి గర్హించునొకో? 71

వ. అని యిత్తెఱంగున విచారడోలాయత్తం బగుచిత్తంబుతో నమ్మత్తకాశినిత్తఱంబునం దలయెత్తి తన యగ్రభాగంబున. 72

సీ. పరమార్థతత్త్వానుభవము వర్ణించు సమధికబ్రహ్మవర్చసమువాని
కైవల్యవాంఛానుకలనంబువిపఠంచు వ్యాఘ్రాజినోత్తరీయంబువాని
వెలిమాడ్కిలాలత్యములఁదబాహిరముగా మునుకొన్నశాంభవీముద్రవాని
వేదముల్ మూర్తీభవించుమేడలపించు సముచితాధ్యయనఘోషంబువాని
తే. హుతహుతాశనతేజుఁడైరయుప్పవాని, హరిచరణభక్తిపుంభావమైనవాని
సాశ్రమక్షేమముఖంబుగా నరుగుదెంచు, తాతఁ గశ్యపుఁ బొడగాంచెఁ దలిరుఁబోణి.

వ. ఇవ్విధంబునం బోడగాంచి భయలజ్జాసంభ్రమంబులం దొట్రుపడుచు నభ్యుత్థానం బాచరించి. 74

సీ. ప్రమదాశ్రుజలముచేఁ దెమలు కాటుకజీర ఉలుకుఁ జెక్కులఁ జాఱుకురులు గ్రమ్మ
మవ్వంపు మొలకచెమ్మటల నెన్నుదుటిపై బొరలు పాపటము తైసరులు దాఁప
మురిపంబుగులుకు పల్లొనల వాతెరఁ జిందు కెంపుముక్కఱ యచ్చాయకెకురుపఱుపఁ
గళసక్తైన నెలకూనగములఁ బేరురముపై రమణీయచంద్రహారములు మనుప
తే. నిదుర వేగింపుఁ గన్కెంపుసదములంపు, మొలకసిగ్గున నగపడు మొగపుదిగువ
నొడలిబడలిక గరువంపు నడలు దాఁపఁ, దండ్రి కెదురేగి మ్రొక్కె నత్తలిరుఁబోణి. 75

క. మ్రొక్కినఁ గాదిలిపట్టిన్, మక్కువ దళుకొత్తఁ జూచి మౌనిమనమున్
జొక్కము సుదివ్యదృష్టిం, గ్రక్కున భావించి తెలిసె గత మున్నఁడై. 76

వ. ఇవ్విధంబునం దనదివ్యజ్ఞానంబునం గూఁతుం దుష్యంతుండు గాంధర్వవివాహంబునం బరిగ్రహించుటయుఁ, గన్యామణికిం దత్కాలంబున గర్భప్రాప్తియుం గాఁగలసంపల్లాభంబునుం దెలిసి కృతకృత్యుండై కరుణార్ద్రకటాక్షవీక్షణంబులం దత్క్షణంబ యయ్యిభయానభయానకరసంబు వాపి మధురాలాపంబుల నుపలాలించుచు నిట్లనియె. 77

శా. అల్లుండయ్యె మహామహుండయిన దుష్యంతుండు ధాత్రీతలం
బెల్లం దాలుచు చక్రవర్తిసుతుఁడై యిప్పాట నీశుక్తిరా
జిల్లెన్నెల్లోరసాని వైతివి బళీ! చిన్నారిపొన్నారినా
తల్లీ! ధన్యతఁ గంటి నీవలన నాదౌహిత్రలాభంబునన్. 78

వ. అనుచు నాశీర్వచనపూర్వకంబుగా నక్కన్యామణిం దేర్చి సంబోధనం బాచరించి ప్రియంవదాదిసఖీలలామంబులం బిలిచి యివ్వరారోహ దౌహృదవతి యగుట నెద్దియేని వాంఛింపం దొరకొని మాద్ధ్యంబున వాక్రువ్వం జాలకుండుం గావున మనోరథం బరసి సమకూర్చునది యని యాదేశించి యథానుగుణంబుగా వర్తింపం గూఁతు నాజ్ఞాపించి తాను యథోచితవర్తనంబునం దనరుచుండె నయ్యవసరంబున. 79

తే. పౌరవాన్వయమునకాఁడికారణంబు, కణ్వదౌహిత్రలాభైకకల్పభూజ
మాళిజనదర్శనోత్సవమలశకుంత, లాయువతి దాల్చె దౌహృదలక్షణంబు. 80

సీ. కలలపోషణసుధాకలశముద్రలరీతి నలినాక్షి చనుమొనల్ నలుపులయ్యె
మనుపనాదొరగాంచు మధ్యలోకముఁ భాతి వెలఁదుకమధ్యంబు విస్తరించె
గర్భార్భకుని యూర్పు గాడ్పు తోడ్పడినట్లు శ్రీమతీమణి యూర్పు లినుమడించె
నత్యజదయనిర్వదహితావళులమాడ్కి లలితాంగివళులు పేలవములయ్యె
తే. జఠరపిఠరాంతరాళకాసారసార, సంపదంసలహంసప్రచారచారు
తరతనుభవానుభావంబు తనరులీల, నరయ నరయంగఁ జెలియాననములసమయ్యె. 81

తే. పంచభూతగుణంబుల పట్టుఁగొమ్మ, భూరిరసవర్గములకెల్లఁ బుట్టినిల్లు

అనిరసారసమాత్మజుఁ డరయఁ దలఁచి, మన్ను వాచవిగాంచె నమ్మధురవాణి. 82

సీ. శరభశార్దూలాదిసత్వంబులను బట్టి ధీరధోరణి నిరోధింపఁ గోరు
శైలంబు శైలంబు లీలతో నిరుగేల నిడి తాళగతుల వాయింపఁ గోరు
నుద్భటప్రతిభటవ్యూహంబు పైఁ గిట్టి యస్త్రశస్త్రముల నూటాడఁ గోరు
నిద్ధారుణీచక్ర మేకచక్రంబుగా నింపుసొంపారఁ బాలింపఁ గోరు
తే. వాజపేయాధ్వరశతంబు వరుసఁ జేసి, యీప్సితార్థంబు ద్విజకోటి కిడఁగఁ గోరు
నార్యవార్యమనస్థైర్యధైర్యశౌర్య, దుర్భరార్భకనిర్భరగర్భయుక్తి. 83

వ. ఇట్లు సంవత్సరత్రితయంబు కడచు నవసరంబున. 84

క. ప్రాంచత్తుంగస్థగ్రహ, పంచకమై యుల్లసిల్లు పటులగ్నమునన్
గాంచె నగాత్రితనూభవుఁ, గాంచెన్ భరతున్ భుజోపగతలాభరతున్. 85

మ. వసుధాచక్ర మవక్రమై విలసిలెన్ వార్థుల్ చెలంగెన్ నదీ
విసరం బచ్ఛపయఃప్రవాహములఁ బర్వెన్ దారకానాథుఁ డు
ల్లసితుండై తనరారె దేవగణికాలాస్యంబు మీఱెన్ దెసల్
వెస రాణించె శకుంతలాతనయునావిర్భావకాలంబునన్. 86

వ. తదనంతరంబ యక్కుమారుండు తాతవలనం జాతకర్మాదిసంస్కారసంస్కృతుండై పెరుగుచు. 87

సీ. ఆకాశకూలంకషాకాశవనవాటి నుదయించుబాహులేయుని విధమున
క్షీరపారావారభూరివీచిమతల్లిఁ గనుపట్టు నవసుధాకరుని కరణి
వాసవాశావధూవరగర్వవరణంబు గడచి రాణించు భాస్కరుని కరణి
నిగమాగమాచారనిర్మితాధ్వరవేదిఁ దులకించు వీతిహోత్రుని విధమున
గీ. గుహ వెడలి మీఱు సింగంపుఁ గొదమ పగిది, గనిఁ బొడమి పేర్చు బలమాని కంబు మాడ్కి
వర్ణితాలిగఫలకవికీర్ణచూర్ణ, కుంతలుండై తనర్చె శాకుంతలుండు. 88

సీ. పరసార్భటీ మేటి శరభసాళువకోటి పరభయంకరధాటిఁ బరిభవించుఁ
గుంచితోరుకపోణి నొంచి దక్షిణపాణిఁ బంచాననశ్రేణిఁ గొంచెపఱుచు
వారణంబులఁ గిట్టి పోరితొండముఁ బట్టి భూరుహమ్ములఁ గట్టి కేరుచుండుఁ
బందపై ఖరిమీఱి కొండలోయలఁ దూఱి గండకమ్ములఁ జేరి బెండుపఱుచు
గీ. రురుతరక్షుప్లవంగాలశార్దూలకోల, ముఖముఖరదుష్టసత్త్వసమూహమూహ
మోహరింపఁగఁ దెగవాఱె సాహసమున, డిందుపఱుచు శకుంతలానందనుండు. 89

వ. ఇవ్విధంబున నిసర్గబలానర్గళభుజార్గళుండై దుర్గంబులగు కాంతారమార్గంబులం గ్రుమ్మరు మహాసత్వంబులగు దుష్టసత్వంబులం బట్టి యక్రమంబున నాశ్రమతరులం గట్టిపెట్టు. పఱచు శకుంతలపట్టిం జూచి వాచంయము లాశ్చర్యచర్యుండగు నీశౌర్యధుర్యుండు

సర్వదమనుండను నామంబునం బ్రఖ్యాతుండయ్యెడుమని దీవించినం గాంచి కణ్వమహా
ముని ప్రహృష్టాంతరంగుఁడయ్యె నిట్లు యౌవరాజ్యపట్టాభిషేకార్హుండగు కుమారుం
జూచి తనయోగక్షేమం బారయ నెడఁ బ్రమత్తుండై యున్న నృపసత్తము వృత్తంబు
నకు విచారడోలాయత్తంబగు చిత్తంబుతో నత్తమిల్లి వేగుతఱి మేల్కాంచి ప్రియం
వదతో శకుంతల యిట్లనియె. 90

సీ. విరులపానుపు మీఁదఁ బొరలుచుండెడు వేళ వరదుఁడై నాథుండు వచ్చినట్లు
నాథుఁడు రాఁ జూచి నగుచు దిగ్గన లేచి యెదురేగి పదముల కెరఁగినట్లు
పాదపద్మములపైఁ బడిన మెల్లన నెత్తి గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చుకొనినయట్లు
గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చికొని సంభ్రమించుచు హాయలుగాఁ బాన్పుపైనునిచినట్లు
తే. హాయలుగాఁ బాన్పుమీఁద నన్నునిచి మనిచి, మరులు గెరలించి లాలించి మదిఁ గరంచి
యతులగతులను రతులను నలరినట్లు, మేలుకలగంటి నంతట మేలుకొంటి. 91

శా. లేమా! లేమరలేమ రల్పకవిరాలిందూలిసోమాన్వయో
ద్దామున్ గోమున నాముకొంటివెనఁటవే తా నైహితాలాపముల్
ప్రేమం గోమలకోమలాక్షరముగాఁ బెక్కాడి సొక్కింప న
క్కామిం గామిని కామినీమనసిజున్ గైకొంటి నాకౌఁగిటన్. 92

ఆ. ఊరులు మరులుకొల్పి యూరించి యూరించి, కానిపోని బూఁటకములఁ దెమలి
కలసి మెలసి తాను గానివాని వితాన, రాజరాజు మరల రాఁడు నేఁడు. 93

మ. తలిదండ్రుల్ దోలుదోల్లఁ గూఁతునకు నుద్వాహంబు గావింపఁగాఁ
దలఁపుల్ పుట్టిన వీర్యశౌర్యగుణవిద్యాసంపదాచారపు
ష్కలమూర్తిన్ వరుఁ గూర్తురత్తఱిఁ గుఱ్ఱన్ గాదయ్యె నాదైన పెం
డిలి యెవ్వారల నొవ్వనాడుదు వధూటీ! నిక్కమూహింపుమా. 94

క. పంపుదు హితులన్నిను రా, వింపుదునని నమ్మఁబలికి విభుఁడత్తఱిఁ గూ
హింపక పొరినన్నుం గా, రింపం దొరఁగొనియె శమనరీతిననీతిన్. 95

వ. అని యివ్విధంబునం గజ్జలరుషులరుషులంబు లగు బాష్పజలంబులు కుచలికుచంబులం జాఱం
జారుముఖి ముఖంబు వాంచి విన్ననై వెచ్చనూర్చుచున్నం జూచి ప్రియంవద నయుం
బొద వనూనయించి కొండొకయవసరంబునం గాశ్యపుల కక్కమలిమనోభావంబు
విన్నవించుటయుం. 96

తే. కాంతుసానన మెప్పుడు గాంతుననుచుఁ, గోరికలగూరు గాడిలికూఁతుఁ జూచి
యౌవరాజ్యపట్టాభిషేకార్హుఁడైన, భరతు నిరతిశయోత్సాహభరితుఁ జూచి. 97

వ. తదనంతరంబ యమ్మహాత్ముండు దన దేవియగు గౌతమిం జేరంబిలిచి గారవంబున శకుంత
లావధూటిం బిలువం బనిచి సన్నిధిం గూర్చున్న తనయనుద్దేశించి తనపత్నితో నిట్లనియె.

క. పెనిచితిమి పెద్దఁజేసితి, మనుకూలుఁడు భర్తగలిగె నాత్మజుఁడొదవెన్
దనయామణి నత్తింటికిఁ, బనుపక యిట్లునుచు టేమిభావ్యము సాధ్వీ! 99

క. తనుపందగు పట్టసముల, మనుపందగు భూషణముల మనుమని కూఁతుం
బనుపందగు నత్తింటికి, ననుపందగుఁ దగుసహాయ మాత్మజతోడన్. 100

వ. అనుచుం దన దేవి నొడంబఱిచి తత్తదనుకూలంబులగు వస్తుజాలంబులం దత్క్షణంబ సంఘటించి యాశ్రమనివాసులగు భూసురులకు సంతర్పణంబు గావించి మనుమనిం గూఁతు నలంకరించుటకుం బ్రియంవదాదులం బనిచిన వార లక్కురవాణిం జీనాంబరాభరణమాల్యాంగరాగంబులం గైసేసి భరతుం గాంచనాభరణవిస్ఫురితుం గావించి గౌతమియుం దారు నచ్చేడియం గణ్వులసన్నిధికిం దోడి తెచ్చిన నచ్చెలువ జననిపను పునం దనచరణంబులకుం బ్రణమిల్లి సన్నిధిని సవ్రీడంబుగా నిలిచియున్నం జూచి తద్వియోగవ్యథావిధురహృదయుండై యమ్మునివరుం డిట్లనియె. 101

చ. కనుఁగవబాష్పపూరములు గ్రమ్మెడు గద్గదఖిన్నమైయెలుం
గనుపునరాదుసూ హృదయమాకులమయ్యెడు మేను గ్రాన్పడుం
బెనిచినవానికింతవగఁ బిమ్మటి గ్రమ్మెడు కన్నవారలుం
దనయను బంపలేక పరితాపభరంబున నెట్లు సైఁతురో. 102

తే. అనుచు వెతనొందు జనకుని యానసంబుఁ, జూచి యడలూన భాషించె సుందరాంగి
బాఁలిమైఁతాజ పెట్టిన పావకంబు, పీవనంజనఁ బైపయి విసరినట్లు. 103

సీ. బలిపుష్టములబారితోలఁగించి మనుచునీ కోకిలార్భము తేఱుకొనినతీరు
పిన్ననాటనుగోలెఁ బెనుపఁజూలైనయీ హరిణిబాలింతరాలైనమేలు
నోనాటములుదీసిమానుమందిడినయీ నెమలినోగంటిమానినవిధంబు
నేనాఁపుశాలూరమూనఁ బెంపైనయీ చెంగల్వకొలనుపూచినతెఱంగు
తే. అయ్యా! మనశార్ఙ్గరవునిచేనైన చిత్ర, భానుచేనైన శృంగిచేనైనఁ గ్రోధి
చేనయినఁ జెప్పిపనుపుము చెప్పిపనుప, వేని వేయేల నీకు నాయానసుమ్ము. 104

సీ. తోయంబుగామీకుఁ దోయమెత్తక కాని తోయంబుఁ ద్రావదీతోయజాక్షి
చివురెత్తు వేడ్కమై చివురుగైసేయమీ చివురుందఁ గోరదీ చివురుఁబోణి
కుసుమాపచితిసన్యకుసుమంబ కాని మీ కుసుమంబుఁ గోయదీకుసుమగాత్రి
ఫలదానములకైన ఫలియించియున్న మీ ఫలమంటదీమహోత్పలసుగంధి
తే. యట్టుమిముఁ బ్రోదిలాలించియరయుచున్న, ననశకుంతలదనుకుమారుతోడ
నత్తవారింటికేగెడు నాదరమున, నాజ్ఞయీఁదగు వనభూరుహంబులార! 105

వ. అనుచు వనతరుసికరంబుఁగనుంగొని శకుంతలతో నమ్మహాముని యిట్లనియె. 106

మ. కలికీ! యత్తిలు నీవు పోవు టెఱుఁగుం గాఁబోలు నిప్పాటని
కల్పలరంభాతరువుల్ సుడింబడి పడింగంపించె జ్యోత్స్నలతన్

తలవాంచె న్నెఱిమూతజాతములు చింతం బల్లవశ్రేణి నో
చ్చిలు నీహారము పేరనశ్రువులు రాల్చెం గంటివే కోమలీ! 107

వ. అనుచు నిత్తెఱంగునం జనకుండునుం గుమారియుం నొండొరుల వెడంబాయంజాలని
వెనరుసందనరుసల్లాపంబులఁ గాలయాపనంబు సేయంజూచి శార్ఙ్గరవప్రముఖులగు
శిష్యు లకాశ్యపులం గాంచి తత్త్వజ్ఞానసంపన్ను లగుమీర లివ్విధంబున విపన్న
భావంబునొందిన నియ్యిందుముఖి డెందంబున మఱియునుం గుందుచున్నయదియది
యునుం గాక ప్రయాణముహూర్తంబు సన్నిహితంబై యుండెం గావున ధైర్యం
బవలంబించి యిక్కాంచనగాత్రికి హితంబుపదేశించి సత్వరంబుగాఁ బనుప నవధ
రించునది యని విన్నవించినం గొండొకసేదదేఱి యమ్మునికులశ్రేష్ఠుండు వనితాజన
మూర్ధన్య యగునక్కన్య నీక్షించి యిట్లనియె. 108

మ. గురుశుశ్రూషలు సేయుమీ సవతులం గూర్మిన్ విలోకింపుమీ
పరివారమ్ములఁ బ్రోవుమీ సిరులగర్వస్ఫూర్తిఁ గైకోకుమీ
పురుషుం దూఱకుమీ సతుల్ నడచు నేర్పుల్ నీకు సూచించితిన్
దరుణీలోకమతల్లి చేకొనవె మాతల్లీ మదీయోక్తులన్. 109

వ. అని సముచితప్రకారంబునం గూఁతునకు హితోపదేశంబు చేసి మనుమనిం గ్రుచ్చి
కౌఁగిటఁ జేర్చి మూర్ధాఘ్రాణంబాచరించి యథోచితంబుగా వీడ్కొలిపి శార్ఙ్గరవ
ప్రముఖుల సహాయంబుగాఁ బనిచి తానును గౌతమియుం గొండొకదవ్వనిపి ప్ర
ఫుల్లమల్లికకల్హారసముల్లసితసౌరభసమీరవిహారం బగునొక్కకాసారతీరంబున నిలిచినం
గాంచి శకుంతలయు భరతుండునుం బునఃపునఃప్రణామంబు లాచరించి సంప్రీతు
లగుజననీజనకులచేతం గ్రమ్మఱ ననుజ్ఞాతులై కతిపయప్రయాణంబులం జని చని
గగనకూలంకషాభరణంబు లగుప్రతప్తకార్తస్వరభాస్వరవరణంబులను, కనత్కనక
ఖచితకాశ్మీరహీరరశ్మిచ్ఛటాసనాథంబు లగుసౌధంబులను, విద్రుమలతావితానమాని
త జాలకంబు లగుగోపురాట్టాలకంబులను, మదకలస్తంబేరమగమనాగమనదుర్గంబు
లగు రాజమార్గంబులను, నానావిధభవ్యద్రవ్యసన్నివేశంబు లగువిపణిదేశంబులను,
నయనాభిరామంబై యున్న యక్కరినగరంబుఁ బ్రవేశించి యరుగుచున్న యక్కాం
చన గాత్రిం గాంచి యద్భుతరసావేశంబున నప్పురపురంధ్రీనికరంబు తమలోన. 110

సీ. నెలనాటి లేటిపిల్లలకుఁ జూపుక్కులుదిద్దు కలికిబిత్తరపుఁగన్నుల బెడంగు
ననలెత్తుపవడంబునకుఁ గెంపురహి నింపు తెలివమవ్వంపువాతెఱ తెఱంగు
నిద్దంపుటద్దంపునివురుదీర్పఁగ నేర్చు తులుకుమిటారిచెక్కుల మెఱుంగు
నిసుపు రేయొని మేనికిఁ గళల్ దులకించు లలనాలలామఫాలమ్ము సొబగు

తే. పసిఁడికినివన్నియలు వెటుభామమేను, చదలునకుసత్వథంబూనుచానకౌను
శ్రీకినవకంబునాటించుచెలియవీను, లహహ జగదేకమోహనం బతివసొబగు. 111

వ. వెండియు. 112

సీ. నెఱనీటుగ్గలవాఁడు నిద్దంపుటద్దంపు డంబూనుగల్లద్వయంబువాఁడు
చూడఁజక్కనివాఁడు సురరాజకరిరాజ కరిరాజదురుదోర్యుగంబువాఁడు
కలికిచూపులవాఁడు చెలువంపుబలుకెంపు లలినింపునధరపల్లవమువాఁడు
మొలకనవ్వులవాఁడు మురిపెంపుసిరిపెంపు మురివింపఁ గులుకునెమ్మొగమువాఁడు
తే. హొయలుగలవాఁడు వెడలుపుటురమువాఁడు, సమధిగతచక్రవర్తిచిహ్నములవాఁడు
హావణిమారటదుష్యంతుఁడనఁగఁజాలు, బాలుఁడీబాలికామణిబాలుఁడెట్లొ. 113

శా. ఈలీలావతి దేవిగాఁగొనుజనుం డేధన్యమూర్ధన్యుఁడో
రోలంబాలక బాలకుండు మునిపుత్రుల్ వెంటరా నొంటిరా
హైళం బేమొకొ తల్లి యింజనకుఁ డివ్వామాక్షికెవ్వారలో
వాలాయంబుగ వచ్చుచున్నయది యవ్వాల్గంటినిం గంటిరే. 114

మ. అనుచుం బౌరులు బారులై నిలిచి యయ్యబ్జాక్షి నీక్షింప న
వ్వనితారత్నము గాంచెఁ గాంచనమణిద్వారస్ఫురద్గోపుర
స్థనదాఖీలగభీరభేరిపటహధ్వానప్రతిధ్వానద
ధ్వనినాదంబగురాజసౌధము వియద్విస్తారసంరోధమున్. 115

వ. ఇవ్విధంబున శకుంతలరాజమందిరద్వారంబు సొచ్చి యచ్చో విచిత్రరత్నప్రభా రమ్యంబు లగుహర్మ్యంబులం గనుంగొనుచుఁ గక్ష్యాంతరంబులుగడచి యొక్కయెడ విరచితకాంచనపాంచాలికాసంచయోదంచితంబులును, ప్రకటముకురనికురుంబవిడం బితప్రతిబింబశోభాభిరామంబులును, గనత్కనకఖచితమణిప్రభాపటలజటిలంబులు నగువిచిత్రభిత్తిఫలకంబులవలనను సుసంభృతశాతకుంభస్తంభసంభావితవితానంబుల వలనను నత్యంతరమణీయంబును నతివిశాలంబును నగుసభాభవనంబునందు వేదవేదాంగ విత్తము లగుభూసురోత్తములును, దర్కమీమాంసాదిశాస్త్రప్రసంగధోరణీపరిణత ప్రశంసు లగువిద్వాంసులును, గావ్యనాటకాలంకారనైపుణీనిష్ణాతు లగుకవీంద్రులును, భాగ్యోదయనిశాంతు లగుసామంతులును, నిజభుజార్గళానర్గళవైఖరీసముద్భటు లగువీరభటులును, మొదలగునుచితపరివారంబు పరివేష్టింపం గనకకంకణకింకిణీఝణ త్కారయానంతులంగాఁ బంకజముఖు లిరుగెలంకుల వింజామరమ్ములు వీవ సము న్నతరత్నసింహాసనమ్మున నాసీనుండై యున్నయన్నరేంద్రునిం జూచి భయలజ్జా కలంకితస్వాంతయై యాత్మగతంబున. 116

ఉ. ఈమహనీయమూర్తిసభకేగలెఁ జేరఁగవచ్చుఁ జేరిచే
నేమనిపల్కుదాన జనులెల్లను నవ్వఁగఁ బూర్వవృత్తమీ

ధీమణితోఁ వచించుటకు దీమసమెయ్యది యెట్టులైననా
హా! మదిగట్టువాపడఁతులందొకదానిఁగ నన్ దలంపరే. 117

ఉ. ఇత్తఱిమాని యేకతమ యే విభుఁ జూడఁ దలంతునేని న
త్యుత్తమరత్నశోభితసమున్నతసౌధములన్వసించుమ
ద్వృత్తమెఱుంగఁ జేయుఁటకు నేరి నెఱుంగ నిఁకేమి సేయుఁ దుర్
గ్రోత్తలఁ జేరనిత్తురె సరోజముఖుల్ గలరెందఱేనియున్. 118

క. తనలోన నిత్తెఱంగున, వనిత వితర్కించి యిపుడ వసుధాధిపునె
మ్మనమునఁ గల తెఱఁగెఱిఁగెద, ననిక్రమ్మఱ నాత్మనిశ్చయముదలకొత్తన్. 119

తే. మృదులపదలీలమదహంసిగదలిపోవు, పాదపుదళుకొత్తమెల్లన నడుగులిడుచుఁ
జనవిభునిచెంతమణిమయస్తంభమొకటి, తనకునఱచాటుగానిల్చెఁ దలిరుఁబోణి. 120

వ. అయ్యవసరంబున. 121

సీ. కనుదోయిగాదిదిక్రమ్ముతుమ్మెదగఱుల్ దొరలకుండినతమ్మివిరులుగాని
మేనుగాదిదిమధుశ్రీ నూనఁగోయిల డగరఁగాననిమ్రానిచిగురుగాని
మోముగాదిదికళాధామమై యేనాఁడుఁ బామెఱుంగనిచందమామగాని
కెమ్మోవిగాదిదిపమ్మినరాచిల్క పిండుగాననిదొండపండుగాని
తే. చెక్కులివిగావునిద్దంపుఁజికిలినొప్పి, తద్దయునెసంగుమించుటద్దములుగాని
దివ్యమోహినియిటకునేతేరనోపు, ననుచునీక్షించె నచటిసభ్యప్రజంబు. 122

క. అపుడొకపరి క్రేఁగంటన్, నృపమణి తనుఁజూచి చూడనివిధంబునఁ దా
విపరీతస్థితినుండినఁ, జపలేక్షణ డెందమందు సందియమందెన్. 123

వ. మఱియు నాత్మగతంబున. 124

తే. అకటకట! చూచిచూడనియటులుపేక్షఁ, జేయుచున్నాఁడెఱుంగకరో యెఱింగి
రో యెఱుంగనటంచులోనొదవుశంక, రాజబింబాస్య యమ్మహారాజుఁ జూచి. 125

మ. జగతీవల్లభ! నన్నెఱుంగవె? గజాశ్వస్యందనశ్రేణితో
మృగయాసంగతి నేగుదెంచి పృతనోర్మిప్రాంతముండించి యొం
టిగఁగణ్వాశ్రమభూమిఁజొచ్చి తమిఁజూడక్రంజేరి గాంధర్వమిం
పుగవర్ణించుచునన్వరింపవె? నభోభూదేవతల్ సాక్షిగన్. 126

మ. అపుడేశా విలసత్కటాక్షలలితాస్యశ్రీవిలాసంబుతోఁ
గృపమీఱన్ ననుఁజూచి వేగఁ దగువారింబంతు నీవస్మదీ
యపురీరత్నవిచిత్రహర్మ్యముల నుద్యల్లీలఁ గ్రీడింప ర
మ్ము పయోజాక్షి! మదగ్రపత్నివసి సమ్మోదంబునం బల్కవే ? 127

క. నేఁటికి నెవ్వరిఁ బనుపక, నాఁటివచోరచనమనసునాటకనన్న
చ్చోటనె నిలిపితి సుయశగ, పాటవమున నెసఁగుభూమిపతి కిదితగునే. 128

క. ఆపలుకులు దుష్యంత, క్ష్మాపాలుఁడు విని హసించి జలజదళాక్షీ!
నీపొడ యెఱుఁగను మరిమరి, వాపోవక పొమ్ము మున్ను వచ్చినత్రోవన్. 129

వ. ఇవ్విధంబున. 130

క. బాలుఁడు తనబాలుండని, బాలామణి తనదు ధర్మపత్నియని మహీ
పాలుం డెఱిఁగియు నెఱుఁగని, వైళంబునఁ బలికె లోకవాదచలితుఁడై. 131

వ. ఇవ్విధంబున నారాజముఖి యమ్మహారాజు పలుకున నాదరవచనంబులకు నుల్లంబు జల్లన
వెల్లనై వెచ్చనూర్చుచు మున్నిలై తోరంగు కన్నీరు పయ్యెదచెఱంగున నొత్తుచుఁ
గటాక్షవీక్షణంబున నారాజును పలక్షించి మహారాజా! నీవేల యెఱుంగ వెఱింగియు నేన
కాని యన్యులెఱుంగరని తప్పం ద్రోచెదవు ధార్మికులగు మహాపురుషులకు నిట్టి దుర్వ్ర
తంబు యుక్తంబగునె? పురుషుండు నడచు నాచారంబులకు వేదంబులును ధర్మంబును
సంధ్యయు నంతరాత్మయు యముండును జంద్రసూర్యులును నహోరాత్రంబులును
సాక్షులై యుండుటం జేసి నిచ్చలు తన్ను మ్రుచ్చిలసమర్థుండెట్లగు? నీచేసినతొంటి
సమయంబు తప్పి నాయెడ నవజ్ఞ సేయఁదగునె? ప్రజావతియుం గుణవతియును సువ్రత
యునగు కులసతి నవగణించుట మహాపాతకంబు అదియునుంగాక ధర్మార్థకామంబుల
కుపకరణంబనియును, జారిత్రపరిశీలనంబునకాచార్యకంబనియును, నన్వయస్థితికిమూ
లంబనియును, సంసారంబునకుఁ గారణంబనియును, హృదయతోషణంబునకుఁ బోష
కంబనియును దద్దయుం బెద్దలు భార్యాపరిగ్రహంబుఁ బెద్దచేసెద రట్లగుట నాయెడల
ననుగ్రహంబు సేయుట మీకు సర్వార్థసాధకంబు. 132

క. నీపాపం డీపాపం, డీపాపని మ్రోలనద్దమిడి కనుఁగొనుమీ
దీపంబున దీపంబభి, రూపంబగునట్లు సదృశరూపుఁడు నీకున్. 133

శా. పారుష్యంబులు పల్కనేల నృపతీ? పన్నీరకర్పూరక
ర్పూరస్ఫారపటీరసౌరభపయఃపూరంబు చంద్రాతపం
బారామానిలసేవనంబు మను మీ రక్షాంతముం గాంతు రౌ
హేరాళంబుగఁ బుత్రగాత్రమిళనం బెట్లుండునో చూడుఁడా. 134

చ. అనఘుఁడు వాజపేయశతమర్థిఁ ఘటించు మహామహుండు పా
వనచరితుండు శౌర్యనిధి వంశకరుండగు నీతనూభవుం
డని యశరీరి బాలునుదయంబు తఱి న్వివరించెఁ గూర్మిఁ గ
న్గొనుమవనీశ! సర్వదమనుండని పల్కిరి వీని ఖేచరుల్. 153

క. పట్టపుదేవిం గాఁ జే, పట్టుదు నినుఁ దనయుం రాజ్యభారవహుంగాఁ
బట్టము గట్టుదునని పనిఁ, బట్టుపఱుచునాఁటిసత్యపథ మెడలకుమీ. 136

సీ. విమలంబులైన కూపములు నూఱిటికంటెఁ బరికింప నొకనడబావి మేలు
హవణిచే నడబావులరయ నూఱిటికంటెఁ గణుతింప నొక్కసత్క్రతువు మేలు

ఘనత మైనట్టియాగములునూఱిటికంటె సుగుణాఢ్యుఁడగునొక్కసుతుఁడు మేలు
సుగుణాఢ్యులగునట్టిసుతులునూర్వుఱికంటె ననినొక్కసత్యభాషణము మేలు
తే. "నానృతాత్పాతకంపర" మనుచువినుచు, వేదవాదులవచనంబువినవొమున్ను
వినియుంమఱచితివో కాక వేదబమున, నేఁచఁదలఁచితివో ధారుణీశ! నన్ను. 137

ఆ. సత్య మశ్వమేధశతముఁ ద్రాసునఁ బెట్టి, తూన్ప ముల్లుసూపెఁదులకు సత్య
మట్టిసత్యమునకు నఖిలవేదంబులు, సకలధర్మములును సాటిరావు. 138

క. కావున సత్యముగుఱిగా, భావింపుము యౌవరాజ్యపట్టస్ఫుట ల
క్ష్మీవిలసితుఁ గావింపుము, గావింపఁగధర్మపత్నిగా ననుఁగనుమీ, 139

క. మేనకకుం గౌశికునకు, నేనుదయించితి నిగణ్వునింటఁ బెరిగితిన్
మానవనాయక! యనృతవి, ధానంబుఘటింప నంతధర్మేతరనే. 140

వ. అని బహుప్రకారంబులం బ్రార్థించుచున్నమంజుభాషిణిసంభాషణంబులుసత్యంబులనితోఁచియునపురావిదులగుటసభాసదులెద్దియుండోఁచకమిన్నకుండిరిమ్మానవపతియుమ్మానవతిసంప్రార్థనంబుఁ బెడచెవులంబెట్టి వెండియు ని ట్లనియె. 141

క. ఎక్కడిసుతుఁ డెక్కడినీ, వెక్కటి నేనన్నృతవాదమేటికిఁ గకీ
చక్కఁదనంబున మత్సము, నొక్కని నెదురొడ్డఁపలుకు టుచితమె నీకున్. 142

వ. అనిన నద్దేవి నిట్టూర్పునిగిడించుచుం గొండొకబడపూరకుండి క్రూరదారుణంబులగుకటాక్షంబులనమ్మహీపతినెమ్మోముఁజూచుచుఱంజూచుచు గాంధర్వవివాహంబునం బరిగ్రహించునప్పటిపలుకులుఁగ్గడించి కపటధార్మిక యప్పుడప్పాటనొప్పం జెప్పియిప్పుడిప్పగిదిఁదప్పంద్రోచిననానోఁచిననోముసఫలంబుగాఁగలదేనినీయడిగినసాక్షులు సాక్షాత్కరింపకుండుదురేయనియెలుంగురాల్పడంబలికి యక్కలికికనుఁగొలంకులఁజారుబాష్పజలపూరంబుఁ గరతలంబులనొత్తికొనుచున్నృపసన్నిధానంబునఁబలువరుపురలినోవనుందోపకయాత్మగతంబునఁ గొండొకవితర్కించి లోకసాక్షియగుపుండరీకాక్షుండుదక్కం దక్కరుకక్కఱతఁ దీర్పంజాలరని తలంచి శ్రీహరినుద్దేశించి యిట్లని వినుతించె.

శా. శ్రీభూనీళలతోఁబరాత్పరతరాజిల్లంజతుర్వ్యూహివై
శోభిల్లన్ విభవావతారములమెచ్చుల్ గూర్పసర్వాంతరం
గాభోగంబునహింపఁబూజనలనుద్వ్యాప్తా ర్తివర్తింపనీ
సౌభాగ్యంబుబు థైకభోగ్యతమమా సత్యంబు నారాయణా. 144

క. కరిణీనాథునిఁ గాచిన, కరుణావరుణాలయుండవుగావున యంబు
చ్చరణారుణాంబురుహముల, శరణము వేఁడెదను సర్వసాక్షివధీశా. 145

శా. పుట్టంబుట్టఁగఁ దల్లిదండ్రులడవిన్ బోఁద్రోచిరివైఖరిన్
బొట్టుంగట్టినప్రాణనాయకుఁడు పోపొమ్మంచు నోనాడెడిన్

గట్టా కోయిలపిల్లచందమున బల్గాసి స్వేఱంగొంటిన
నిట్టట్టుం గికురింపఁ జూచెదవొ కుయ్యాలింపవే శ్రీహరీ. 146

సీ. పురుడుం దీఱకమున్న పూపప్రాయపుదానిఁ గానలోఁ ద్రోచిరి కన్నవారు
కోరికూడినభర్తఁ జేరుమింతనటంచు గొడఁగిపంచిరి పెంచుకొన్నవారు
నీపెడ నేనేడఁ ద్రోవపట్టుమటంచు మన్నింపరై రేలుకొన్నవారు
పాపపుణ్యము లెఱుపఱిచి చెప్పఁగలేక మిన్నకుండిరి చుట్లనున్నవారు
తే. సాక్షిగా మిమ్ము రూపించి జనవిభుండు, నట్టడవిలోన నన్నట్టుపట్టుపఱిచి
వెడలిపొమ్మనుచున్నాఁడు వేదబముస, నశరణశరణ్య యాలింపుమా ముకుంద. 147

వ. అని యివ్విధంబునం బ్రార్థించునమ్మించుఁబోడియాలమటఁ దీర్పం దలంచి. 148

మ. ఫలదుండై తగు పార్వతీరమణుఁడున్ భాషావధూనాథుఁడున్
బలభిద్వహ్నిముఖాఖిలామరవరుల్ పార్శ్వంబులం జుట్టిరా
లలదుత్తుంగపతంగరాజరథుఁడై లక్ష్మీసమేతంబుగా
జలజాక్షుండు శకుంతలావరదుఁడై సాక్షాత్కరించెన్ రహిన్. 149

వ. ఇత్తెఱంగున నమ్మత్తకాశినిసత్యంబునకుం బాతివ్రత్యంబునకు మెచ్చి యచ్చెరుపాటున నియచ్చరులు పొగడుకలకలం బాలించుచు నీశుండును వాగీశుండును లోనుగాఁగ దివ్యపురుషులు సాంగసాయుధసపరివారంబుగా నలుగెలంకులం బలసి నిలువ శ్రీభూనీళాసమేతంబుగా గరుడవాహనారూఢుండై కిరీటకటకగ్రైవేయకేయూరకాంచీముఖభూషణస్థగితమణికిరణప్రభాజాలంబు నలుగడలం గడలుకొన నద్దేవదేవుండు సాక్షాత్కరించినం గాంచి సామంతమంత్రిపురోహితప్రముఖపరివారసహితంబుగా దిగ్గన లేచి దండప్రణామంబు లాచరించి ముకుళితకరకమలుండై యెద్దియుం బలుక నేరక మిన్నకున్నం గని యాపన్నశరణ్యుం డగు నప్పన్నగశయానుండు నరనాథునిముఖంబునఁ గరుణాంతరంగితంబులగు నిజకటాక్షవీక్షణంబులోలయ మృదుమధురగంభీరస్వనంబునఁ ని ట్లనియె. 150

శా. సత్సంతానఫలామరద్రుమము సంసారక్రియామూలమూ
పత్సంపత్సదృశావలంబనము సౌభాగ్యాలవాలమ్ము ని
త్యోత్సాహంబులపట్టుఁగొమ్మ సుకృతోద్యోగానుసంధానమో
వత్సా! యిట్టిపతివ్రతాతిలకము న్వంచించెదే బేలవై. 151

ఆ. నీమనోరథంబు నెఱవేర్చి పిదప నీ, సేమమరయఁ గోరి కోమలాంగి
బాలుతోడ నిన్నుఁ బ్రాపింపవచ్చిన, నవగణింపఁదగునె యవనినాథ! 152

సీ. అభినవస్వర్గక్రియారంభమున నుగ్రదీక్షఁ గానించు గాధిజుఁడు తండ్రి
లోకోపకారార్థ మాకౌశికుతప స్సిద్ధి మాన్పు మేనకాదేవి తల్లి

భూతలమ్మున నూర్ధ్వరేతుఁడైతగుకాశ్యపుఁడు భయత్రాతయుం బోషకుండు
చిత్రవిచిత్రసృష్టికళాధురీణుఁడై తగుకశ్యపబ్రహ్మ తండ్రి తండ్రి
తే. యసదుగాఁ జూడఁగూడఁదీయలివ యతివ, రాశ్రమంబున నిశ్రమంబపనయింపఁ
గలిగెనీచక్రవర్తిలక్షణముదాల్చు, బాలుఁ డష్టాదశద్వీపపాలకుండు. 153

వ. అనుచు దుష్యంతమహీకాంతునకు నాజ్ఞాపించి యానందకందళితహృదయారవింద యైయున్నశకుంతల ననునయించుచు నద్దేవదేవుం డిట్లని యానతిచ్చె. 154

తే. మామనీలమహీపాలమౌళియత్త, గణితవృత్తరదంతసద్గుణనిశాంత
వరఁగ దుష్యంతభూభర్త భర్తనీకు, భయమెడలుమమ్మ నీకేమి భాగ్యమతివి. 155

వ. అనియిట్లు సజలజలధరగంభీరమధురఘోషంబుతో సంతోషింపం జేయునత్తోయ జాక్షు నుపలక్షించి సవినయంబుగా దుష్యంతుం డిట్లని వినుతించె. 156

దండకము. శ్రీమద్రమావిద్రుమోష్ఠీసమారూఢపక్షీశమారూపితాతాక్షసమీచీనవీక్షానిమీల ద్విపక్షా సమత్రాణదక్షా పయోజాతజాతాండతండోదయస్థేమభంగాదిలీలావిచిత్రా నిరాలంబచిత్రా మరున్నీలగాత్రా సరోజాతనేత్రా ధరిత్రీకళత్రా హితానందమూలా శతానందఖేలా సహస్రారహస్తా బహుస్ఫారశస్త్రాయపండంబులండంబులండంబులున్ వస్తుకాండంబు యద్వ్యష్టిశాంశోత్తరావారమున్ యద్గుణాంబుల్ ప్రధానంబునం బూపమిందున్ త్రిపాద్భూతయున్ యత్పరబ్రహ్మమున్ యుష్మదంశాంశలేశప్రతిష్ఠాగరిష్ఠంబులంచున్ త్రయీతత్త్వవాదుల్ ప్రబోధింతురీశా పృథివ్యాదులం గార్యముల్ కారణస్థానమున్ జేరసంహారకేలీకళాశీలివై వేలిభూతప్రపంచంబులెంగొందు నవ్యాకృతిన్ శుద్ధసత్త్వావృతిం గూడిక్రీడించుచున్ ద్రష్టగన్ విస్తరించన్ యదృచ్ఛానియంతృత్వదచ్ఛాబలజ్ఞానశక్తిత్రయిన్ జాట్యుల్లసన్నొప్పచెంపై యనన్వామరూపప్రసక్తిన్ మహత్తైయహంకారమై పంచతన్మాత్రమై పంచభూతంబులై దేవతిర్యఙ్మనుష్యాదికవ్యక్తులై వస్తులన్ జాలనున్నం గృపం జీవులన్ నావులం జేర్చి పాలార్చియుందుం బరేశుండవై ప్రోచుచున్ వ్యూహభేదంబులంగాంచుచున్ దివ్యలీలావతారంబులం దీర్చుచుం బ్రాఁతిమైనంతరాత్మస్వరూపంబునం జేర్చుచుం బొంగి శ్రీరంగకాంచీనగస్నాధశేషాచలాది ప్రతిష్ఠానిదేశంబు లానిర్వ్యదేశంబులన్ భక్తవారంబులన్ సంతతానదంపూరంబులం దేల్చుధీరుండవీవేకదా ఘోరమాసీరథింజోరవైతూంటి వేదాపహారిన్ విదారింపవా, పేర్మిమైఁగూర్మమై కూర్మిమై యుస్వులన్ మెప్పులన్ గుప్పఁగాసుందరామందరాగంబునన్ మందరాగంబుఁబెన్ గోపునన్ మూపునం దాల్పవా, క్రీడమైగ్రోడరూపంబునం బ్రోడవైయాహిరణ్యాక్షుమైనోహగన్ సాహసన్ దూఱుచున్ దూరుచున్ బోరుచున్ జేరిచెండాడవా, భైరవంబౌనృకంఠీరవంబై భుజాగౌరవంబున్ నిజోగ్రారవంబుం దివంబెల్ల ఘూర్ణిల్లఁ జేయన్ బయోజాతభూజాతభూత్ప్రధా ఖర్వగర్వోద్ధవంబా జైయుద్దైలేయుంముంగోరులం జేరురమ్మున్ వడిన్ జీరిగాంచించి ప్రహ్లాదు

సాహ్లాదుఁ గావింపవా! గుజ్జవై వెజ్జవై హజ్జనిమ్ము జగంబు జగింపన్ బలిన్ వేఁడవా! జామ
దగ్న్యుండవై ఘోరధారాసముద్యత్కుఠారంబుచేఁ బూని ముయ్యేడుమాఱుల్ మహాక్రో
ధులన్ ధారుణీనాథులం గూల్చుచున్ సాధులన్ వైభవామోదులం జేయవా! రామ
రూపంబునన్ భీమకోపంబునన్ లోకవిద్రావణున్ రావణున్ ధాటిచేఁ గీటణంగింతు
వంచున్, మహింగామపాలుండవై శ్యామచేలుండవై సామలోలుండవై భీమశీలుం
డవై శత్రుహాలాహలంబున్ లలింబూని పోరం బ్రలంబాదులన్ మేదినింగూల్తు
వంచున్, మరుత్వన్ముఖప్రార్థనాబద్ధరోషంబునన్ బుద్ధవేషంబునన్ దానవస్త్రీనవా
మోదసంధాయివై దేవతాజీవితంబుల్ ధృతింగాతువంచున్, గలింగల్కిభావంబునన్
బల్ రవాల్గుఱ్ఱపుస్నేటిరాహుత్తవై హత్తిదుర్వృత్తులౌ మత్తులన్ గుత్తుకల్ గత్తినువ్వొత్తు
గన్ గోసి బాహాలసద్ధోరణీ ధారుణిన్ బ్రోతువంచున్, బురాణంబులున్ శాస్త్రముల్
వేదముల్ వేదశీర్షంబులున్ బల్కునంచున్ మహాయోగివర్యుల్ రుచింపన్
వచింపన్ వినం గాంతు నబ్జోదరా సంవిదేకాంతమై యాద్యమై హృద్యమై భవ్యమై
దివ్యమై యోగమాగమ్యమై సౌమ్యమై నిర్మలంబై నిరాకారమై సారమై శుద్ధమై
బుద్ధమై నిష్కలంబై జయంబై నిజంబౌ భవద్దివ్యతేజం బిళాపింగళామధ్యవీథిన్ నిరో
ధించి భావించి సేవించు ధీరుల్ గదా నిత్యసూరుల్ సదానంద గోవింద మావిందవై
యిందిరాదేవితో నందిరాశీవితో నిందురా నెవ్వఁడుర్విం దిరంబై కడున్ సుందరంబ
య్యె మద్గోత్రమున్ బాత్రమయ్యెన్ మదాచారమున్ సంతతోదారమయ్యెన్
గృతార్థుండనైతిన్ త్రయీతత్త్వపారాయణా యాదినారాయణా దేవ తుభ్యన్నమ
స్తే నమస్తే నమః. 157

వ. అని యనేకప్రకారంబుల వినుతించి వెండియు నిట్లనియె. 158

శా. దేవా కాశ్యపు నాశ్రమంబునకు నర్థింబోవనీ లేమతో
దైవంబున్ బెరరేఁపఁగా నొదవె గాంధర్వక్రమోద్వాహమీ
భావంబన్య లెఱుంగమిన్ వెఱచితిన్ బాలామణిన్ గైకొనన్
నావృత్తాంతము నే నెఱుంగనఁటవె నాళీకపత్రేక్షణా! 159

ఉ. ఏనిక నేనికట్లభయమిచ్చితిరిచ్చలు నిచ్చలున్ బర
ధ్యానపరాయణుండనక తావకపాదపయోజయుగ్మమి
మ్మానినిసాక్షిగా నొడివి మత్సహచారిణి యయ్యె నయ్యెడన్
దీనశరణ్య మీర లరుదెంచుట చిత్రమె తత్రసాక్షివై. 160

క. మెచ్చితిరాత్మన్ సాక్షికి, వచ్చితిరిందుల జనాపవాదము దీఱన్
దెచ్చితిరి మాకు విశ్రుతి, నిచ్చితిరభయప్రదానమిమ్మానినికిన్. 161

వ. ఇత్తెఱంగున హరినుద్దేశించి పలుకుచు సగౌరవంబుగా శకుంతలం గలిసికొని శ్రీభూ
నీళాసహితుం డగునద్దేవదేవునకుఁ బ్రదక్షిణనమస్కారంబు లాచరించి. 162

ఉ. దండము పార్వతీపతికి దండము వాగ్రమణీవినోదికిన్
దండము వాసవాగ్ని యమదానవముఖ్యదిగీశరాజికిన్
దండము నారదాదులకు దండము చారణసిద్ధకోటికిన్
దండమటంచు దేవియును దానును మ్రొక్కెను దేవతాళికిన్. 163

వ. ఇవ్విధంబున నవ్వధూవరులు హరిహరవిరించిబృందారకమునిబృందారకబృందంబులకుం గ్రమంబున వందనంబులాచరించి సవిషయంబుగా భరతుని మ్రొక్కంబనిచిన నక్కుమారుండును విష్ణుదేవునకుం బ్రణమిల్లి పశుపతికిం బ్రణిపాతంబు గావించి చతురాననునకు దండప్రణామంబాచరించి యింద్రాది దిక్పాలురకుం జోహారు గావించి నారదాదిమహామునులకు నమస్కరించిన నద్దేవదేవుం డక్కుమారకంఠీరవుగాంభీర్యధైర్యౌదార్యాదివిశేషంబులకు మెచ్చి శకుంతలాదుష్యంతులం గాంచి యితండు వాజపేయాధ్వరశతంబుం గావించి యష్టాదశద్వీపంబులం దనశాసనంబు నిరర్గళంబుగా వర్తిలంజేయుచు వంశకర్తయై కీర్తిపౌరుషంబులు సంపాదింపంగలవాఁ డని యాదేశించి కరుణాతరంగితకటాక్షవీక్షణంబులం గృతార్థులం గావించి యంత నయ్యనంతుండు సపరివారంబుగా నంతర్ధానంబు చేసె నయ్యవసరంబున. 164

క. ఆడిరి రంభాదులు రహిఁ, బాడిరి గానం బునూనఫణితిన్ ఖచరుల్
వీడిరి ఖేదము పౌరులు, కూడిరి దుష్యంతుఁడును శకుంతలయుం ధృతిన్. 165

వ. ఇవ్విధంబున దుష్యంతుండును శకుంతలాసమేతుండై కుమారునకు యౌవరాజ్యపట్టాభిషేకోత్సవంబు నిర్వర్తించి బ్రాహ్మణులనానావిధమహార్హవస్తుప్రదానంబులం దనిపి మహోన్నతవిభవంబున శకుంతలయుం దానును యథేష్టభోగంబులం దనరుచు రాజ్యంబు పాలించుచుండె నని వైశంపాయనుండు జనమేజయునకుం జెప్పె వెండియు నిట్లనియె.

## ఫలశ్రుతి.

సీ. ధర్మార్థులకు భూరిధర్మప్రదంబగు నర్థార్థులకు నగు నర్థదంబు
కామార్థులకు భవ్యకామప్రదంబగు మోక్షార్థులకునగు మోక్షదంబు
పరిణయార్థులకును బరిణయప్రదమగుఁ బుత్రార్థులకు నగుఁ బుత్రదంబు
సంపదర్థులకును సంపత్ప్రదంబగు విజయార్థులకునగు విజయకరము
తే. వేడ్కఁ జదివినవ్రాసినవినినయట్టి, ఘనులకఖిలార్థలాభంబు గలుగుచుండు
నవనినాచంద్రతారార్కమలఘులీలఁ, బరిఢవిల్లు శకుంతలాపరిణయంబు. 167
తే. అనిశకుంతలాకల్యాణమనువుమీఱ, మానినాథుండు చెప్పినమనుజవిభుఁడు
వీనులారంగవినుచుండివిస్మయమునఁ, బొంగిసంతోషభరితాంతరంగుఁడయ్యె. 168

## ఆశ్వాసాంతము.

చ. హరిహరినాగనాగపశతారకతారకతారతారకా
శరశరదిందుకుందహరిచందనచందనభారభారతీ

పరవరవాజివాజిరథవాసభనాసమృణాళనాళవి
స్తరతరకీర్తికీర్తితసదానసదానన వేంకటేశ్వరా. 169

భుజంగప్రయాతము.

కృపాధారదా సేరకృష్ణాద్రిదూరా, విపశ్చిజ్జనారాధ్య వేదాంతబోధ్యా
కపాలిస్తుతస్థేమకల్యాణధామా, రిపుధ్వాంతఘస్రేశ శ్రీ వేంకటేశా. 170

గద్య. ఇది శ్రీమత్కౌసల్యానందనప్రసాదసమాసాదితకవితావిచిత్ర మైత్రేయసగోత్ర నృసింహగురుపుత్త్ర కృష్ణకవిప్రణీతం బైనశకుంతలాపరిణయం బనుమహాప్రబంధంబునందు శకుంతలాదుష్యంతసంవాదంబును శ్రీవిష్ణుసాక్షాత్కారంబును శ్రీవిష్ణుసంకీర్తనంబును భరతయావరాజ్యపట్టాభిషేకంబును శకుంతలాదుష్యంతపునస్సుభోగోపాఖ్యానంబు ననుకథలంగలసర్వంబును దృతీయాశ్వాసము.

శకుంతలాపరిణయము

స మా ప్త ము.

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1927.

# ఆంధ్రగ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అచ్చతెనుగురామాయణము, శుద్ధప్రతి | ... | 1 | 4 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 10 |
| అడవిమల్లెలు, ఎనమండ్రనారాయణమూర్తి | ... | 0 | 8 |
| అధ్యాత్మరామాయణము, క్రొత్తకూర్పు | ... | 1 | 8 |
| అనంతునిఛందము, ఛందోదర్పణము | ... | 0 | 14 |
| అనిరుద్ధచరిత్రము, కనుపర్తి అబ్బయామాత్యప్రణీతము | ... | 0 | 8 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 14 |
| అప్పకవీయము, శ్రీగిడుగురామమూర్తి పంతులుగారి విమర్శతో నున్నది. | | 2 | 8 |
| అంబరీషోపాఖ్యానము, సటీక (భాగవతము) | ... | 0 | 4 |
| ఆముక్తమాల్యద, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో మేలు కాకితములమీఁద చక్కఁగ మరల ముద్రించియున్నారము | ... | 3 | 8 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 2 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైనప్రతుల కన్న అన్నివిధముల బాగుగనున్నది | ... | 5 | 0 |
| డిటో అత్యుత్తమప్రతి, రెండుసంపుటములు | ... | 7 | 8 |
| డిటో 3 సంపుటములు | ... | 9 | 0 |

శ్రీమదాంధ్రభారతము-పద్యకావ్యము:—

అనేకవ్రాతప్రతుల సహాయమున చిరకాలమునుండి సంపూర్ణపరిశ్రమముతోఁ బరిష్కరింపఁబడినది. మేలుకాగితములపై స్ఫుటముగ అచ్చొత్తించి మంచికాలికోబైండు చేయఁబడియున్నది.

| | | రూ. | అ. |
|---|---|---|---|
| 7 సంపుటముల ప్రతి | ... | 14 | 0 |
| 3 సంపుటముల ప్రతి | ... | 13 | 0 |
| ఆది, సభాపర్వములుగల సంపుటము | ... | 2 | 0 |
| ఆరణ్యపర్వము ,, | ... | 2 | 0 |
| విరాటోద్యోగపర్వములు ,, | ... | 2 | 0 |
| భీష్మద్రోణపర్వములు ,, | ... | 2 | 0 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు ,, | ... | 2 | 0 |
| శాంతిపర్వము | ... | 2 | 0 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములుగల సంపుటము | ... | 2 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | ... | 5 | 8 |
| యుద్ధపంచకము ,, | ... | 3 | 12 |
| శాంతిసప్తకము ,, | ... | 3 | 12 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆదిపర్వము మాత్రము, పెద్దచ్చు, చిన్నసైజు | ... | 1 | 8 |
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిది | ... | 0 | 8 |
| ఆనందరంగరాట్ఛందము, కాలికోబైండు | ... | 1 | 8 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము, కావ్యస్మృతితీర్థ: జనమంచి శేషాద్రిశర్మకృతము, 3 సంపుటములు | ... | 12 | 0 |
| డిటో 7 సంపుటములు | ... | 14 | 0 |
| ఆంధ్రబ్రహ్మాండపురాణము | ... | 5 | 0 |
| ఆంధ్రలలితోపాఖ్యానము | ... | 1 | 8 |
| ఆంధ్రభాషాభూషణము | ... | 0 | 2 |
| ఆంధ్రభాషార్ణవము, అట్టబైండు | ... | 0 | 12 |
| ,, కాలికోబైండు | ... | 1 | 2 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు; టీకానుక్రమణికాసహితము | ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 0 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | ... | 0 | 8 |
| కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవిది | ... | 0 | 6 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము. మేలుప్రతి | ... | 2 | 0 |
| ఉత్తరహరివంశము, నాచనసోమనాథకృతము | ... | 1 | 8 |
| కవికర్ణరసాయనము, మాంధాతచరిత్ర | ... | 1 | 8 |
| డిటో మేలుప్రతి, కాలికోబైండు | ... | 1 | 14 |
| కళాపూర్ణోదయము, దళసరికాకితములు | ... | 2 | 4 |
| కాశీఖండము, చక్కనిక్రొత్తకూర్పు | ... | 1 | 8 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 12 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 4 |
| డిటో గట్టుప్రభుకృతము | ... | 0 | 6 |
| కృష్ణరాయవిజయము, కుమార ధూర్జటికృతము | ... | 0 | 8 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు | ... | 0 | 6 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 8 |
| గణికాగుణప్రవర్తనతారావళి | ... | 0 | 2 |
| గరుడాచలము, యక్షగానము, పెద్దచ్చు | ... | 0 | 2 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు, శ్రీమద్రామాయణమునకు సరియైన పద్యము, కవనము మిక్కిలి సొంపు, పీఠిక అతివిపులము | ... | 7 | 8 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము | ... | 1 | 2 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆదిపర్వము మాత్రము, పెద్దచ్చు, చిన్నసైజు | ... | 1 | 8 |
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిది | ... | 0 | 8 |
| ఆనందరంగరాట్ఛందము, కాలికోబైండు | ... | 1 | 8 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము, కావ్యస్మృతితీర్థ: జనమంచి శేషాద్రిశర్మకృతము, 3 సంపుటములు | ... | 12 | 0 |
| డిటో 7 సంపుటములు | ... | 14 | 0 |
| ఆంధ్రబ్రహ్మాండపురాణము | ... | 5 | 0 |
| ఆంధ్రలలితోపాఖ్యానము | ... | 1 | 8 |
| ఆంధ్రభాషాభూషణము | ... | 0 | 2 |
| ఆంధ్రభాషార్ణవము, అట్టబైండు | ... | 0 | 12 |
| ,, కాలికోబైండు | ... | 1 | 2 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు; టీకాను క్రమణికాసహితము | ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 0 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | ... | 0 | 8 |
| కవిసంశయవిచ్ఛేదము, ఆడిదము సూరకవిది | ... | 0 | 6 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము. మేలుప్రతి | ... | 2 | 0 |
| ఉత్తరహరివంశము, నాచనసోమనాథకృతము | ... | 1 | 8 |
| కవికర్ణరసాయనము, మాంధాతచరిత్ర | ... | 1 | 8 |
| డిటో మేలుప్రతి, కాలికోబైండు | ... | 1 | 14 |
| కళాపూర్ణోదయము, దళసరికాకితములు | ... | 2 | 4 |
| కాశీఖండము, చక్కనిక్రొత్తకూర్పు | ... | 1 | 8 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 12 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 4 |
| డిటో గట్టుప్రభుకృతము | ... | 0 | 6 |
| కృష్ణరాయవిజయము, కుమార ధూర్జటికృతము | ... | 0 | 8 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు | ... | 0 | 6 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 8 |
| గణికాగుణప్రవర్తనతారావళి | ... | 0 | 2 |
| గరుడాచలము, యక్షగానము, పెద్దచ్చు | ... | 0 | 2 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు, శ్రీమద్రామాయణమునకు సరియైన పద్యము, కవనము మిక్కిలి సొంపు, పీఠిక అతివిపులము | ... | 7 | 8 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము | ... | 1 | 2 |

| | | ప్రతి. 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| చాటుపద్యమణిమంజరి, క్రొత్తకూర్పు, ప్రథమభాగము | ... | 1 | 4 |
| డిటో రెండవభాగము, సాధారణప్రతి | ... | 1 | 6 |
| డిటో మేలుప్రతి, గ్లేజుకాకితములది | ... | 1 | 10 |
| ఛందోదర్పణము (అనంతునిఛందము) | ... | 0 | 14 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము, చక్కనికూర్పు | ... | 1 | 0 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 6 |
| తారాశశాంకవిజయము, చక్కనికూర్పు | ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 4 |
| తెనుఁగుసమస్యలు, చక్కనికూర్పు | ... | 0 | 2 |
| దశకుమారచరిత్రము, పద్యకావ్యము, కేతనకవికృతము, చక్కనిప్రతి | | 1 | 8 |
| దశావతారచరిత్ర, నూతనముద్రితము | ... | 2 | 0 |
| దసరాపద్యములు | ... | 0 | 2 |
| నరసభూపాలీయము | ... | 0 | 10 |
| డిటో మేలుప్రతి, కాలికోబైండు | ... | 1 | 0 |
| నలోపాఖ్యానము, సటీక, చిన్నసైజు | ... | 0 | 6 |
| నలచరిత్ర, ద్విపద | ... | 0 | 14 |
| నిర్వచనోత్తరరామాయణము, సాధారణప్రతి | ... | 1 | 0 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము | ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి తిమ్మకవికృతము | ... | 0 | 4 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 8 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రగ్గడ, క్రొత్తకూర్పు | ... | 1 | 0 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 6 |
| పంచతంత్రము, నారాయణకవికృతము | ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 2 |
| డిటో వేంకటనాథరాజకవికృతము | ... | 1 | 4 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు | ... | 0 | 10 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 14 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు, క్రొత్తకూర్పు | ... | 0 | 8 |
| బసవపురాణము, పిడుపర్తిసోమనాథప్రణీతము | ... | 2 | 4 |
| బ్రహ్మోత్తరఖండము | ... | 1 | 0 |
| బిల్హణీయము, చక్కనికూర్పు | ... | 0 | 8 |
| భాస్కరరామాయణము, చక్కని క్రొత్తకూర్పు | ... | 4 | 0 |
| భోజరాజీయము, అనంతామాత్యకృతము | ... | 1 | 2 |
| భోగినీదండకము | ... | 0 | 1 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| విజయవిలాసము, చేమకూర వేంకటకవికృతము | ... | 0 | 8 |
| డిటో కాలికో బైండు | ... | 0 | 12 |
| విరాటపర్వము, పద్యకావ్యము, ప్రథమాశ్వాసము | ... | 0 | 8 |
| డిటో ,, ద్వితీయాశ్వాసము | ... | 0 | 8 |
| డిటో ,, తృతీయాశ్వాసము | ... | 0 | 12 |
| వీరభద్రవిజయము, బమ్మెర పోతరాజకృతము | ... | 0 | 12 |
| వేంకటాచలమాహాత్మ్యము, తరిగొండ వెంకమ్మది | ... | 1 | 0 |
| డిటో కాలికో బైండు | ... | 1 | 6 |
| వేమనపద్యములు, చక్కనికూర్పు | ... | 0 | 6 |
| డిటో బ్రౌనుదొరగారి ఇంగ్లీషుతో | ... | 1 | 4 |
| డిటో 2728 పద్యములు, కాలికో బైండు | ... | 1 | 12 |
| వేమనపద్యములు, 2728 పద్యములు, తాత్పర్యసహితము, ఇందు గ్రంథవిమర్శ, కవిజీవితము మొదలగునవి చేర్పఁబడినవి, చక్కనిక్రొత్తకూర్పు | | 3 | 8 |
| వైశ్యపురాణము | ... | 1 | 4 |
| వైజయంతీవిలాసము | ... | 0 | 8 |
| శతకంఠరామాయణము, క్రొత్తకూర్పు | ... | 0 | 10 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము | ... | 0 | 12 |
| శశిరేఖాపరిణయము, అప్పప్పకవికృతము | ... | 0 | 12 |
| శివలీలావిలాసము, కూచిమంచితిమ్మకవిప్రణీతము | ... | 0 | 6 |
| శ్రీసాధుసీవీథినాటకము | ... | 0 | 2 |
| శృంగారనైషధము శ్రీనాథకవిది, క్రొత్తకూర్పు | ... | 1 | 0 |
| ,, కాలికో బైండు | ... | 1 | 6 |
| శేషధర్మము, పద్యము, క్రొత్తకూర్పు | ... | 0 | 12 |
| సహస్రకంఠరామాయణము | ... | 0 | 12 |
| సప్తమస్కంధము, సాధారణప్రతి, (భాగవతము) | ... | 0 | 6 |
| ,, సటీక, చిన్నసైజు | ... | 1 | 0 |
| డిటో కాలికో బైండు | ... | 1 | 4 |
| సాంబనిఘంటువు, సటీక | ... | 0 | 8 |
| సారంగధరచరిత్రము, చేమకూర వేంకటకవికృతము | ... | 0 | 8 |
| సానందోపాఖ్యానము, శ్రీశివరామకవివిరచితము | ... | 1 | 0 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి, ఈ,